ORIENTAL RESEARCH INSTITUTE PUBLICATIONS.

TELUGU SERIES No. 1.

# VISHNU PURANAM

BY

KALIDINDI BHAVANARAYANA

K. Gopal Krishna Rao M. A.
Lecturer in Telugu.
Nizam College, Hyderabad-Dn.

EDITED BY

K. RAMAKRISHNAYYA, M.A.,
*Reader in Telugu.*

P. LAKSHMIKANTHAM, B.A.,
*Fellow in Telugu*

INSTITUTE OF ORIENTAL RESEARCH
UNIVERSITY OF MADRAS.




Madras:
PRINTED AT THE ANANDA PRESS

ప్రాచ్యపరిశోధనాలయ ప్రచురణములు.

ఆంధ్రగ్రంథమాల

I

# విష్ణుపురాణము.

కలిదిండి - భావనారాయణ ప్రణీతము.

సంపాదకులు.

కే. రామకృష్ణయ్య, ఎం. ఏ.,

తెలుఁగురీడరు.

పి. లక్ష్మీకాంతం, బి. ఏ.

తెలుఁగు ఫెల్లో.

ప్రాచ్యపరిశోధనాలయము

మద్రాసు విశ్వకళాపరిషత్తు.




చెన్నపురి.

ఆనందముద్రణాలయ ముద్రితము.

# ఉపోద్ఘాతము.

ఈ విష్ణుపురాణమును దెనిఁగించిన కవి భావనారాయణ. ఆశ్వాసాంత గద్యముల నీతని యింటిపేరు కలిదిండివారని కలదు. కాని కృత్యాదిపద్యములలో స్వవిషయమును జెప్పుకొన్న.—

సీ. సమధికస్ఫూర్తి కృష్ణాగౌతమీమధ్య, దేశంబునకు భవ్యతిలకమగుచుఁ,
బొగడొందు కలిదిండిపురమున కధిపతి, సుగుణుఁడాపస్తంబ సూత్రుఁడధికుఁ
డసమశాలంకాయనసగోత్రుఁడడవిరా, చయమంత్రి వెలయుఁనయ్యనఘమతికిఁ
దనయుండు మంత్రిరాజనఘుఁడాతఁడుగాంచె, విమలచారిత్రుని వేంకటాద్రి ;
నమ్మహాత్మునకును సూరమాంబికకును, నందనుఁడఁ బూరుషోత్తమనాథపాద ।
వందనానంద మహిమ జీవాతుజీవ, నాఖ్యుఁడను భావనారాయణాభిదుఁడను ॥”

ఈ పద్యమునుబట్టి యింటిపేరు 'అడవి' వారనుటయుఁ గలిదిండియనునది యీతని నివాసగ్రామము పేరేకాని యింటిపేరు కాదనుటయు స్పష్టము. కాని యితని ముత్తాత రాచయమంత్రి కలిదిండికధిపతియైయుండుటను బిమ్మట మూఁడు తరములు గడచునప్పటికి (భావనారాయణుని నాఁటికి) మొదటియింటిపేరు పోయి చిరకాలనివాసమువలన గ్రామనామమే గృహనామముగా సిద్ధించె నేమో ? అట్లు జరుగుటయుఁ బెక్కుచోట్లఁగలదు.

తరముల్ నాల్గయిదెందు నెందునగుఁ, దత్తత్ గ్రామనామంబులన్
బరగున్ వంశములెల్లఁ బూర్వపునిజ ప్రఖ్యాతిమాయంగ ”

మ పింగళి సూరనార్యోక్తి యిప్పట్లఁగూడ సార్థకమైనదేమో ? అట్లుగాక గద్యలో 'కలిదిండి' అనిపడుట వ్రాయసకాండ్ర ప్రమాదమైనఁ గావచ్చును. 'కలిదిండి' ప్రస్తుతము 'బందరు' పట్టణమునకు సుమా రిరువదిమైళ్ల దూరమునఁ గలదు. ఆయూర నిప్పటికిని గోటయను పేర వ్యవహరింపఁబడు నొకప్రదేశము కలదు. అచ్చటఁ బూర్వమొకదుర్గముండెనఁట. ఉండెననుటకుఁ దార్కాణముగా నాప్రదేశమున నిప్పటికిని గోడలయు, బురుజులయు జాడలుగలవు. రాచయ మంత్రియాదుర్గాధిపతియో, లేక, కేవలము గ్రామకరణికుఁడో యయియుండును.

చిక్కినది. నీనిని బట్టియైనను సిద్ధాంతముచేయ సాహసింపక బలవత్తరమైన యాధారము లంభించునటకు నిది యేయుపాదేయము కావచ్చునని కైకొంటిమి.

సుదక్షిణా పరిణయకర్తయైన తెనాలి అన్నయ్యకును, నీ భావ నారాయణకును గురుస్థాన మొకటియే.

క॥ కందాళ భావనార్యుల, నందను శ్రీరంగగురుని నతబుధరక్షా।
మందారంబు నుతింతును, మందారమరందబిందు మధురారభటిన్ ॥

(సుదక్షిణా పరిణయము)

కందాళభావనార్యుని కుమారుడైన శ్రీరంగాచార్యులే మనయడవిభావనారాయణకవికిని గురువని యూహించుట కాధారము. రెంటను దండ్రి పేరుకూడ సరిపోవుటయే.

ఈ సుదక్షిణాపరిణయకృతీశ్వరుడు కోనేటిరామరాజుమంత్రియైన పులిజాలసోమనామాత్యుడు. ఈ కోనేటి రామరాజు, సదాశివరాయలకు బ్రతినిధిగా విజయనగర సామ్రాజ్యము పాలించి 1565 లో దల్లికోట యుద్ధమున గతించిన అళియరామరాజునకు బెనతండ్రికొడుకు మనుమడు. అళియ రామరాజు చిరకాలజీవి. అతనికి మరణకాలమునాటికే యెదిగిన మనమలు కలరు. కాన నాతని పెదతండ్రికొడుకునకును నాతల్లికోటయుద్ధము నాటికే మనుమడుండియుండవచ్చును. ఆ మనుమడు (కోనేటి రామరాజు)రాజ్యాధిపత్యము వహించుటకు గొంత యెక్కువకాలమే పట్టినదనుకొన్నను, నట్టిది క్రీ॥ శ॥ 1600, సంవత్సర ప్రాంతముల జరిగియుండవచ్చును. కనుక సుదక్షిణా పరిణయకృతీశ్వరుని ప్రభువు క్రీ॥ శ॥ 1600 సంవత్సర ప్రాంతముల వాడు. కాగా సుదక్షిణాపరిణయకర్తయు నాకాలమువాడే యగును. మనభావనారాయణయు నాతనికి సమకాలికుడగుటచే నప్పటి వాడైయుండును. అనగా క్రీ॥ శ॥ 16 శతాబ్దితుది భాగమువాడని మాత్రమే చెప్పవచ్చును.

భావనారాయణ శ్రీ పురుషోత్తమస్వామిభక్తుడు. సుభద్రా దేవతోపాసకుడు. కావుననే "సుభద్రా కరుణాకటాక్ష వీక్షాలబ్ధకవిత్వతత్త్వ పవిత్రుండ" నని చెప్పికొనెను. (ఆ 1 ప 10) కందాళ శ్రీరంగాచార్యులతని గురువు. గురవనగా గులగురువేగాక, విద్యాగురువని కూడ నూహించుట కాధారముగా "కందాళ శ్రీరంగ గురుని మద్గురుని భజింతు నభీష్టార్థరూఢికొఱకు"

(ఆ 1 ప 6)

అని గురుశబ్దము రెండుమార్లు ప్రయుక్తమైనది. గురుదేవతాభక్తి కలవాడగు నీకవి విద్యాగురు నొకని వేఱుగా బేర్కొనకపోవుటయు నీ యూహకు బ్రోద్బలముగానున్నది.

ఈపురాణమునకు ముందీకవి పురుషోత్తమఖండమను నొక ప్రబంధము వ్రాసెనఁట.

“గీ॥ ఘనత శ్రీపురుషోత్తమ ఖండమాంధ్ర,
నవ్యపదబంధములఁ బ్రబంధంబుచేసి।
యెన్నఁగలదైవమైయున్న వెన్నముద్ద,
ముద్దుకృష్ణున కంకితంబుగ నొసర్చి ॥

(ఆ 1 ప 11)

ఈ పురాణమును మూలముతోడను, వెన్నెలగంటి సూరన విష్ణుపురాణముతోడను బోల్చి చూచితిమి. తెలిచిచూడఁగాఁ దెనుఁగుపురాణములలో నింతయథామాత్రృకమైన రచన యేకన్పట్టదు. వెన్నెలకంటి సూరన విష్ణుపురాణము భారతాదులవలె మూలమునకు యథోచితానుసరణమేగాని దీనివలె యథామాత్రృకముకాదు. తనకుఁ బూర్వము సుప్రసిద్ధమైన యొకవిష్ణుపురాణము తెనుఁగుననుండఁగాఁ దానును నాగ్రంథము రచింపఁబూనుటలో నీకవి సంకల్పము స్వార్థాహంకారప్రేరితముగాక మూలవిధేయతను సంపాదించు కోర్కెవలనఁ గలిగియుండును. నేఁడు బ్ర॥ శ్రీ. వే. కవిరాజ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి గారి భారత రచనా సంకల్పమువంటిదే యీ భావనారాయణకవి సంకల్పమైయున్నది. ఇందీతఁడు కృతార్థుఁడయ్యెనని యే చెప్పవచ్చును. ఎడనెడఁ గొలఁది మూలాతిక్రమణములున్నను నవియంతగాఁ బాటింపఁదగినట్లుగా నగపడవు. అయినను నచ్చో స్వతంత్ర రచనలున్నవో, వానినన్నిటినేరి యీ క్రిందఁ బొందుపఱచెదము.

(1) యజ్ఞవరాహావిర్భావఘట్టమున మూలములో లేనితన్మూర్తి విశేషవర్ణనమిందుఁ గలదు. మూలమున.—

“ సామస్వరధ్వనిః శ్రీమాన్, జగర్జ పరిఘుర్ఘురః ”

అని యున్న యేకవాక్యమును బురస్కరించుకొని యీకవి,

“సీ॥ తనువువిసర్ప సంస్తబ్ధతనూరుహాల్, ద్ధతి నజాండంబుఁ బ్రేములు వ్రాల,
వాలధిత్రిప్ప దుర్వారవాతాహతి, నబ్దముల్ వలయాభ్రియనలికేగ।
ఘుర్ఘురధ్వనిచేయఁ గోటిసంఖ్యాక, నిర్ఘాతాంభటిశంకఁ గిడలుకొనఁగ,
అడుగువెట్టిన బలోదగ్రఖురాది ఘట్టన నగేంద్రములైన దునిసిపోవ ॥
గీ॥ హరియొయజ్ఞత్రయీమయంబైన ఘోణిరూపధేయంబు దాల్చియారూఢమహిమ।
దనుజనస్థానవాసులై మునులు వొగడ, సంభృతోల్లాసభాసియై జలధిఁ జొచ్చె ॥

(ఆ 1 ప 98)

2. నిశ్శ్రీకులైన దేవతలు, బ్రహ్మనుపురస్కరించుకొని పాల్కడలిచేరి విష్ణుని స్తోత్రముచేయఁగా భగవంతుఁడు వారికి దర్శనమిచ్చు సందర్భమున మూలములో,—

"తందృష్ట్వాతే తదా దేవాః, శంఖచక్రగదాధరమ్।
అపూర్వరూప సంస్థానం, తేజసాంరాశి మూర్జితమ్॥

అనునొకశ్లోకము కలదు.— ఈ శ్లోకార్థమును నీ కవియెంతగాఁ బెంచెనో చూడుఁడు.—

"సీ॥ ఎదబొదల్ సిరిమేననొదుగు నుంజాయల మక్కడించిన పైడిమణుఁగువాని
తళుకుదంతముల నిద్దపుఁరుచిచ్చటలని, న్మఢిమైన కిలికిలే నగవువాని।
మేలిడాల్చల్లుకెంగేలిచిందపుతేట, నీలైనచుట్టు వాల్మెఱుఁగువాని
తెలికన్నుగొనల చూపులఁ జాలకళ లెక్క, నక్రకుండల సమున్నతులవాని॥
గీ॥ చతురకలశాంబునిధి సుధాసౌధవీధి, జిలుగుతెరగల ముత్యాలచేర్లుసిరుల।
నలరుఫణిరాజు తూగుటుయ్యాలఁదూఁగువాని,శ్రీజానిఁగనిరి వాగ్వరుఁడుసురలు॥

(ఆ 1-వ 208.)

వెన్నెలగంటి సూరనగ్రంథములో నిట్టిదే యొక వర్ణనకలదు. ఇది వాని యను కరణమని తోఁచెడిని.

సీ॥ శతకోటి భాస్కర సందీప్తతేజునిఁ, బ్రావృట్పయోధర భవ్యగాత్రు
శంఖసుదర్శన శార్ఙ్గగదా హస్తుఁ, బీతకౌశేయశోభిత కటీరు।
లాలిత శ్రీవత్సలాంఛన లాంఛితుఁ గౌస్తుభగ్రైవేయక ప్రభావు
ఇందిరామందిరా యతపీనవక్షునిఁ, దారుణ్యకోటి కందర్పమూర్తి॥
గీ॥ పుండరీకాక్షు జగదేక పూతచరితు, సతతకరుణాకటాక్ష వీక్షణసమస్త।
యోగినిర్మల హృదయపయోజనిలయు,విష్ణుపాదగాంచి సంతోషవివశులగుచు॥

(వె. సూ. విష్ణుపురాణ, ఆ 1 వ 166.)

3. పాల్కడలిని లక్ష్మి యావిర్భవించు ఘట్టమున మూలములో లేనివర్ణన మిందు చాలఁగలదు. (ఆ 1 వ 224-230) ఇట్టి వర్ణన వెన్నెలగంటి సూరన గ్రంథములోను లేదు.

4. ధ్రువచరిత్ర.

ఇందీకథయంతయు యథామాతృకమే గాని తపము చేయఁబోవు ధ్రువుఁడు తల్లితో.—

చ॥ అమితపరాభవానల శిఖావృతిగందిన నింకనుత్తమో
త్తమపద లాభమొందెద వృథావచనంబులు వల్కనీనప।

త్నిమదికి విస్మయంబొదవఁ దెల్లముతండ్రియుఁ బొందనోపఁడు
త్తముఁడన నెంతియంచువిబుధ ప్రవరుల్వినుతించుచునట్లుగన్ ॥

అనియాడినమాట మూలములో లేదు. ఈ యతిక్రమణమువల్ల నేమేని గుణము లభించినదాయన్న, ధ్రువునకహంకారము కూర్చినదేకాని గుణముకూర్ప లేదు. ఈ కథకు మూలమున లేని వన్నె తెచ్చినవాఁడు వెన్నెలగంటి సూరన. రస సంపాదనార్థమాతఁడీ కథను గొంత విపులముగఁ బెంచి వ్రాసి సంకల్ప సిద్ధుఁడయ్యెను. సర్వథా యీ ఘట్టమున సూరనయే మేలుచేయి యనవచ్చును ఉదాహరణార్థ మొక సందర్భము చూపెదము. సవతి తల్లిచే బ్రేటువడి బిక్కమొగముతో ధ్రువుఁడు తల్లిచెంతకుఁ బోవుటను.—

క॥ ధ్రువుఁడపుడవిరళకోపో, ద్భవుఁడై యచ్చోటువాసి తనునొందుపరా ।
భవము తనతల్లికెఱిఁగిం, చ వడిందద్గేహమునకుఁ జయ్యనఁబోయెన్ ॥

క॥ పరిభవ పీడితుసీపత్, స్ఫురితాధరుఁ దనయునపుడు చూచి జననియా ।
దరమునసంకస్థలినిడి, శిరమాఘ్రాణించియనియెఁ జిత్తముచెదరన్ ॥

అని భాగవత నారాయణ చిత్రించెను. దీనినే సూరన.—

చ॥ కనుగవనశ్రుపూరములు గ్రమ్మఁగ వీడిన కాకపక్షముల్
వెనుకకువీల దైన్యరసవేదన నిల్వఁగలేక యేడ్చుచున్ ।
జనని నికేతనంబునకుఁ జయ్యనఁబోయి ధ్రువుండు దీనుఁడై
తన పెదతల్లి సేతయును దండ్రియుపేక్షయుఁ జెప్పెఁజెప్పినన్ ॥

గీ॥ కొడుకుకన్నుల బాష్పముల్ తుడిచి తల్లి, శిరముమూర్కొని కౌగిటఁ జేరియేడు।
వుడిపితనకునుగన్ను నీరొలుకుచుండ, నతనితోగద్గద స్వరయగుచుననియె ॥

అని సరళ తాసుందరములును, హృదయంగమములు నైన పద్యములలో వర్ణించెను.

4. కండుముని చరిత్ర.

ఈ మునితపము సేయదొరకొనఁగాఁ దత్క్షోభ కొఱకు సురేంద్రునిచే బ్రమ్లోచయను నప్సరస ప్రయుక్తయై యామునిని గలఁచెనఁట.

"సతేపే సుమహత్తపః,
తత్క్షోభాయసురేంద్రేణ ప్రమ్లోచాఖ్యావరాప్సరాః ।
ప్రయుక్తాక్షోభయా మాస తమృషింసాశుచిస్మితా ॥" మూలము.

ఈ ఘట్టము వర్ణనానుకూల విషయముగాన నీకవి యాముని చేయుతపము వేఁడిమి దుర్వారమై లోకముల బెగ్గిడిలఁ జేసెననియు, సంత దేవేంద్ర ప్రేరితయై వచ్చి ప్రమ్లోచ యా ముని మ్రోల శృంగారచేష్టా విలాసములు నెఱపె

ననియు, నంత నాతని తపము కలతనడి చెడెననియు, నేమేమో పెంచి కొన్ని రసవంతములైన పద్యములు పొందుపఱచినాఁడు, (1 ఆ ప 406—412) ఇది మూలాతిక్రమణమే యైనను రససంపాదన హేతువే యైనది. మఱియుఁ గండుముని మరల నెఱుక గలవాఁడై యప్సరస నుజ్జగించి కాలక్రమమున శ్రీ పురుషోత్తమ క్షేత్రముచేరి స్వామిని సందర్శించు సందర్భమున నిందు గల పద్యములకు మూలమున నాధారములేదు. (ఆ 1—450—477 ప.) కవి యిచ్చట నింత విపుల వర్ణనముచేయుట కేవల మిష్టదేవతా పక్షపాత గరిమచేతనే యనవచ్చును.

5. ప్రహ్లాదచరిత్ర.

భాగవత ప్రసిద్ధమైన నృసింహావిర్భావము విష్ణుపురాణమున లేనేలేదు. హిరణ్యకశిపుఁ డనుతప్తుఁడై కుమారునిఁ బ్రేమ పూర్వకముగాఁ గైకొని శేషించిన జీవితకాలము సుఖముగా గడపినట్లొక శ్లోకమున నున్నది. అట్లయ్యును దరువాతి శ్లోకమునఁ బ్రహ్లాద రాజ్యాభిషేకమునకుఁ గారణముగాఁ దండ్రి నృసింహునిచే నంత మొందింపఁ బడఁగాఁ బ్రహ్లాదుఁడు రాజయ్యె నని కలదు. ఇది సందర్భ రహితముగానున్నది.

"ఇత్యుక్త్వాఽన్తర్దధే విష్ణుః, తత్ర మైత్రేయపశ్యతః ।
సచాపి పునరాగమ్య వవన్దే చరణౌ పితుః ॥
తంపితా మూర్ధ్న్యుపాఘ్రాయ, పరిష్వజ్యచ పీడితమ్ ।
జీవసీత్యాహ, వత్సేతి బాష్పార్ద్ర నయనోద్విజ ॥
ప్రీతిమాంశ్చా భవత్తస్మిన్, అనుతాపీ మహాసురః ।
గురుపిత్రోశ్చకారైవ, శుశ్రూషాం సోపిధర్మవిత్ ॥
పితర్యు పరతంనీతే, నరసింహ స్వరూపిణా ।
విష్ణునా సోఽపి దైత్యానాం, మైత్రేయా భూత్పతిస్తతః ॥"

మూలమున నిట్లుండఁగా నీ తెనుఁగు సేఁతలో నృసింహరూపము మాటయే వదలి జనకుఁడు దివికేఁగఁ బ్రహ్లాదుఁడు రాజయ్యెనని కలదు.

"సీ॥ జనకుండు దివికేఁబోయిన దైత్యపతియయ్యెఁ బ్రహ్లాదుఁడంత."

(ఆ 1—ప 657).

వెన్నెలగంటి. సూరన్న గ్రంథములో నింకను భిన్నముగానున్నది.

(ఆ 2—ప 829 etc)

6. జడభరతోపాఖ్యానము,

ఈ గాథ యిందు మూలమును సూరనరచననుగూడ ధిక్కరించుచున్నది. భాగవతముతోఁగూడఁ బోల్చిచూడ భావనారాయణ రచనయే సర్వాతిశాయియై

కనుపట్టినది. ఒక తార్కాణము, భరతాశ్రమమున లేడి పిల్ల సంచారము వర్ణించుపట్టు.

మూలము. "చచారాశ్ర మపర్యంతే తృణాని గహనేషుసః।
దూరంగత్వా చ శార్దూల త్రాసాదభ్యాయయాపునః ॥
ప్రాతర్గత్వాతి దూరంచ సాయమాయాత్త దాశ్రమమ్।
పునశ్చభరతస్యా భూత్ ఆశ్రమస్యోట జాజిరే ॥

సూరన.

సీ॥ పూరి మేయగదవ్వుపోయి బెబ్బులిపిండు, దిగులునఁగ్రమ్మఱఁ దిరిగివచ్చు
సారెసారెకుఁదదాశ్రమ సమీపమ్మున, వేడ్కతో గంతులు వేయుచుండు।
మలయుచువచ్చికోమల యుగ్మశృంగంబు, చేతనెమ్మెని కండూతిఁదీర్చు
యోగాసనంబునబాగు మీరగనుండ, మవ్వాపుతొడలపైఁ బవ్వళించు ॥

గీ॥ పర్ణశాలచుట్టు పరువులువెట్టుచు, లేతయైనపూరి మేతమేయు।
ననుదినంబునిట్టు లామృగశాబంబు, ముద్దుచూపుచుండు మునివరునకు ॥

భాగవతము.

చ॥ గురువులువాఱి, బిట్టుఱికికొమ్ముల జిమ్ముచునంతకంతడ
గ్గఱచునుగాలుద్రవ్వుచు నఖంబులగీఱుచు గాసిసేయుచు।
న్నొఱగుచుధారుణీ శ్వరునియూరువులన్నయ నించియంతలో
నఱకడమెక్కుచున్ బొదవియాడుచు నాహరిణంబులీలతోన్ ॥

(పంచమస్కం॥ 106-ప॥)

భావనారాయణ

సీ॥ నటనగా నుటజాంగణమున గంతులువేయు, మురియుచు నవకుశముష్టి మేయు
కండూతిప్రోఖురాగ్రములనంగముఁగోకు, వెఱమృగంబులఁజూచిబెదఱిపఱచు।
తరుణరసాలపోతముల ప్రక్కలురాయు, పలుమారుకుంజ గర్భములుదూరు
దూరంబుగానటవీరాజిఁబడిపోవు, వేవేగమగుడి యావిర్భవించు ॥

గీ॥ కెలనఁదనసీడఁగన్గొని క్రేళ్లుదాటు, నేఁమూర్కొని పలుమారునింగిచూచు।
నలసిశయనించిరోమంథమాచరించు, తరుణమృగశాబమారాచతపసియెదుట ॥

పైనుదాహరించిన పద్యములలోనీపద్యము లలితలలితమై,స్వభావోక్తి గుంభితమై యెంతయో మనోహరముగా నున్నదనుటకు సంశయము లేదు,

7. రామచరితము.

రామునిపుట్టుక, రామునిమహిమ, దక్షిణాపథము, ఋషిజనస్తోత్రము మొదలగు విషయములు మూలమున లేనివియిందు కల్పించి వ్రాయఁబడినవి.

(ఆ 4-వ 165 - 193)

ఈయాశ్వాసము నందే పరశురామవర్ణనగల 276 పద్యమునకు మూలాధారము లేదు, గ్రంథమంతయు మూలముతోఁ బోల్చిచూడఁగా స్వకల్పితములని చెప్పందగిన ప్రకరణము లివిమాత్రమే. గ్రంథబాహుళ్యమును బట్టియాస్వల్పము పేక్షించితిమేని, రచనమొత్తముమీఁద యథామాతృక మనుట సత్యేతరము కాఁజాలదు. ప్రాసంగికముగా సూరనవిష్ణుపురాణమునుగూడఁ దడవిప్రకరణ వశమునఁ జెప్పఁ దగిన తారతమ్యములఁ దెల్పితిమి. కాని యింకొక్క విషయము. సంస్కృతపురాణ మాఱంశలుగలది. సూరనదాని నంతయు నెనిమిది యాశ్వాసములుగాఁ దెనిఁగించెను. ఈ గ్రంథమున నాల్గంశలు మాత్రమే గలవు. తక్కు రెండును నీకవి తెనిఁగింపనే లేదో, యట్లుగాక గ్రంథమే నష్టమైనదో, యుభయపక్షముల నేదిద్దైనను నిదిమాత్ర మసమగ్ర గ్రంథమే యైనది.

శైలి-:

సాధారణముగాఁ బురాణముల యందలి శైలికిని, ప్రబంధముల శైలికిని స్థూలదృష్టికిఁగూడ గోచరించు వాసియుండును. మొదటిది ప్రసన్న గంభీరమైన శరన్నదీ ప్రవాహమువంటిది. రెండవది దరులొరసి కొనుచు, తరంగితమై పొంగిపొరలు ప్రావృట్ప్రవాహమువంటిది. తెనుఁగున భాగవతమువంటి యేయొకటి రెండో తక్క, తక్కినపురాణము లన్నియు నీప్రమాణమునకు విధేయములే. తెనుఁగునఁ బ్రబంధ రచనయుఁ, దత్పఠనమును మిక్కిలిగా సాగిన పిమ్మట బయలుదేరిన పురాణములు కాలధర్మమతిక్ర మింపఁజాలక ప్రబంధ ఫక్కినే నడచినవి. కంకంటి పాపరాజకృతోత్తర రామాయణ మిందుకుఁ దార్కాణ. ఈ భావనారాయణ విష్ణుపురాణమును నిట్టిదియే. వెన్నెలగంటి సూరనగ్రంథము నకును దీనికిని ముఖ్యభేదమిచ్చటనే కలదు. సూరనశైలి సర్వథా పురాణవిలక్షణ శోభితము. ఇది ప్రబంధల లక్షణసంయుతము.

8. శబ్దప్రయోగవిశేషములు.

కొన్ని వ్యాకరణములను ప్రమాణములుగా గైకొని యీగ్రంథమును బరీక్షించి నచోఁ దప్పులని చెప్పఁదగిన ప్రయోగములు కొన్ని పొడగట్టును, కాని

మేమువానికిఁ దప్పులనక ప్రయోగవిశేషము లందుము. ఏమనస్వతంత్రుఁడును, బహుగ్రంథ కర్తయునగు కవినినసమగ్ర లక్షణమునకు విధేయునిఁ జేయుట శాస్త్రవిరుద్ధము అట్టి ప్రయోగ విశేషముల నీక్రిందఁ బొందుపఱుచుచున్నాము.—

ఆ ప విశేషము.

1 23 — కార్మొగుల్ పసగెల్వ (కార్మొగుల పసలనియర్థము)
481 — కార్మొగుల్ నిగనిగల్ (కార్మొగుల నిగనిగలు)
538 — మిక్కిలీ భూవలయంబునన్. (మిక్కిలి యీ భూవలయంబునన్)
64 — మిక్కిలయ్యున్.
578 — గట్టియుండన్ - (కట్టియైయుండన్)
105 — ఒసరుదేను (ఒసరుదున్, ఏను)
111 — కేశవాచ్యుత (కేశవ ! అచ్యుత !)
182 — చేసిటు - (చేసి+ఇటు)
చుట్టిచ్చి - చుట్టి+ఇచ్చి)
190 — ఎక్కుక - ఎక్కుకొని.
208 — ఎడబాడల్ - ఎడబాడలు.
206 — చొరవఁగా - చొరఁగా.
408 — సతులవెయ్యింటిఁ గనియె, - వేయిమందిని అనుట.
568 — అని దైత్యేంద్రుని సమ్మతించి - సమ్మతింపఁజేసి.
2 71 — 2పా॥ సంపూర్ణ స్వార్తి-ర్ణ-లఘువు చేయబడినది.
78 — క్రొవ్వునఁ గోడలిఁగూఁతురుఁ గలిసిన.
235 — తనయుకు - (తనయునకు)
3 74 — పథ్యుకు - పథ్యునకు.
4 184 — తీసుక - తీసికొని.

ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమున నీగ్రంథము ప్రతియొక్కటి యేకలదు. అందెక్కుడు తప్పులు గాని గ్రంథ పాఠములుగాని లేవు. ఇదిగాక డాక్టర్. బుఱ్ఱా శేషగిరిరావు పంతులుగారు యమ్, ఏ. పిహెచ్, డి. (ఆంధ్రభారతీ తీర్థాధ్యక్షులు (విజయనగరము) వారియొద్దఁగల వేఱొక ప్రతి యాదరమున) నొసంగిరి. మాయొద్దనున్న ప్రతిలో సందిగ్ధములైయున్న కొన్ని పాఠముల దానినిబట్టి చక్కఁజేసితిమి. ఈ రెంటనుతీరని సందేహములను మూలమునుబట్టి

సంస్కరించితిమి. ఈ రెండు ప్రతులలోనుగూడ సర్వథైకశద్వము కొలకని గాఁబోలును తఱచుగా విసంధిపాటింపఁబడినది. ఇది ప్రాయసగాని యజ్ఞత వలనఁ గలిగినదిగాఁ దోపకుండుటచేఁ బెక్కుస్థలముల యథామాతృకముగా దానినట్లే యుంచినారము గాని సంస్కరింప సాహసింపలేదు.

ఆంధ్రశాఖ.
ప్రాచ్యపరిశోధనాలయము.
లిమ్‌డీ గార్డన్సు
మద్రాసు. 15-9-1929.

కోరాడ - రామకృష్ణయ్య ఎమ్. ఏ.
రీడరు.
పింగళి - లక్ష్మీకాంతం, బి ఏ.
ఫెల్లో.

1930-వ సంవత్సరము జులై మాసారంభమున నీప్రాచ్యపరిశోధనాలయ విషయమున జరిగిన మార్పులనుబట్టి, యాంధ్రశాఖలో నంతకుఁబూర్వము ఫెల్లోగానుండిన పింగళి - లక్ష్మీకాంతం. బి. యే. గారికి ప్రతిగా వర్ఝుల చినసీతారామస్వామి శాస్త్రిలుగారు వచ్చియుండుటచే, నీగ్రంథమున 3-వ యాశ్వాసము 150-వ పద్యము మొదలు కొన్నిపూఁఫులు వీరిసాహాయ్యమున సరిచూడఁబడినవి.

కోరాడ - రామకృష్ణయ్య.

శ్రీరస్తు.

# విష్ణుపురాణము.

## భావనారాయణకృతము.

### ప్రథమాంశము.



శ్రీనీలాచల శృంగభాగమున, సంశ్లిష్యత్సుభద్రాలతా
వ్యాసద్ధత్వమెలర్ప, నాశ్రితమనోవాంఛావిధానావధా
నాసూనంబగు పూరుషోత్తమ సుపర్వానోకహస్వామి, మా
కానందప్రదకామితార్థ ఫలసద్గాహప్తిఁగావించుతన్ ॥ 1

సీ॥ తనుభజించఁగ నేర్చు జనులకోర్కె లొసఁగనేర్చు, సిరిఁగూర్చు కేలి కెంజిగురులలర ।
అధికమాధురిఁ దెచ్చు నమృతపూరము మెచ్చు, నసపెంచు కెమ్మోవిపండు వెలయ ।
సామజస్యము నించు, చక్కఁదనము మించు, పులకించు గుబ్బగుత్తులు వెలుంగ ।
జెవులసేవలు దేరు సింగారములు మీరు, నినుఁజేరు బల్కుఁ దేనియలు చిలుక ॥

గీ॥ నీలగిరివాస నృహరి వక్షోలవాల, దేశమున వృద్ధిఁబొంది యర్థితములొసఁగు ।
ఘనతరశ్రీసుభద్రాఖ్యకల్పలతిక, లీల నేకోరు ఫలము ఫలించుఁగాత ॥ 2

మ॥ కలధౌతాచల చారుచక్రహసదంగిచ్ఛాయతో, గండమం
డల నృత్యన్మణికుండల ప్రతిభతో నవ్యాసితోద్యన్నిచో
లలసద్దీధితితో, మనోజ్ఞనవమాలాలంకృతోరస్థలీ
విలుఠద్ధారలతాభతో వెలయు నద్వైదుం, బలుం, గొల్చెదన్ ॥ 3

చ॥ మెలఁగు నినాగ్నులుట్టిపడు మిన్నగు రుద్ధతియుద్ధబద్ధదో
హలబలనన్నిశాటు లెదురైనను సాంద్రపతంగకోటిగా
గొలఁదిడరాని తేజములఁ గప్పు, కకుప్పతి తలకించు, శ్రీ
నిలయు మహాసుదర్శనము, నిచ్చలు, నన్ గరుణించుఁగావుతన్ ॥ 4

సీ॥ ప్రకటప్రభావ మార్కండేయశయన ప్రముఖాష్టకము, క్షేత్రపాలనికర ।
మాపవిణాత్రయాధ్యక్షత్వము నమించు నేకించు విమలాన దేవతలును ।

దలఁచినమాత్రఁ బాతక జాలములఁ ద్రుంచు పటువైభవము తీర్థపంచకంబు ।
త్రిభువనశాసనోద్దీపితుండు గ్రసేన నమాహ్వయుండు సేనావిభుండు ॥
కమలనేత్రుని దేహానుకూలయనటంబు, సిరులు శ్రీపురుషోత్తమ క్షేత్రమునకు ।
నఖిలధనమునునగుపీఠయనన్న నీయ, కృతికి శుభ మొసగుదురుగాక యతులమహిమ ॥

తనకు మొక్కిన మొక్క, జనులనోకహ విచ్ఛిన్న ప్రచండపరశ్వధంబు ।
తనసేవ పాతకోపటలికి గభీరత్వ దుస్తరసంసారవారిధితరణి ।
తనశ్రీమదంఘ్రి తీర్థము, ముక్తిసామ్రాజ్య పట్టాభిషేక సంభారజలము ।
తనసంశ్రయణము, సౌధాంతి మహనీయ కైవల్య నిశ్రేణికాశ్రయంబు ॥

గాంగ వాధూలగోత్ర సాగరశశాంక, భాష్యనాచార్య తనయుఁడై ప్రబలు, నపర ।
హారిని, కందాళశ్రీసింగ గురుని, మనుసునిభజింతు నభీష్టార్థరూఢికొఱకు ॥ 6

పూర్ణభక్తిభజింతుఁ బొయిగిపూర్తి సేయాళువారుల చరణాంబుజములు ।
సేవింతుమదిలోన శ్రీభక్తిసార భట్టాధిప కులశేఖ రార్యవరులఁ ।
బ్రణుతింతు మునివాహభక్తాంఘ్రిరేణు ద్విపద్దాడకరుల నిశ్చలమనీష ।
వరివస్యగూర్తు మధురకవిశఠగోప భాష్యకర్తలకు సౌభాగ్యరేఖ ।

నాథయామునముని కూరనాథపుండరీక, కృత్రామ మిశ్రాదిలోకవిశ్రు । [కు॥
తాఖ్యగురుసంఘములకుసాష్టాంగనతులు, సేయుదు మదీయకృతికి మేల్సేయుకొఱ

తారకబ్రహ్మ మంత్రరహస్య నావేశ ప్రాపితుని మనః పదవిఁగొలిచి ।
చిదచిదీశ్వర తత్త్వ విన్నాణయశాలి శ్రీపరాశరసూరి సద్రీతిభజించి ।
గీతోపనిష దర్థజాత నిర్ణేతయా బాదరాయణు పదాబ్జముల కెఱఁగి ।
శ్రీకృష్ణ పాదరాజీవ చంచచ్చంచరీకాత్ముశుకయోగిని సంప్రీతిఁ బొగడి ॥

ఆంజనేయ కయాధుసు తాంబరీష, నారద విభీషణాది పుణ్యస్వరూప ।
పరమభాగవతాంఘ్రి పంకరుహములకు, సవినయాధిక సద్భక్తి,సాఁగి మొక్కి ॥

సమధికస్ఫూర్తిఁ గృష్ణా గౌతమీమధ్య దేశంబునకుభవ్య తిలకమగుచుఁ ।
బొగడొందు కలిదిండిపురమున నధిపతి సుగుణుండాపస్తంబసూత్రుఁడధికుఁ ।
డనమశాలంకాయనసగోత్రుఁ డడవిరాచయమంత్రి వెలయు,నయ్యనఘమతికిఁ ।
దనయుండు,మంత్రి రాజనఘుఁ డాతఁడుగాంచె విమల చారిత్రుని వేంకటాద్రి ।

నమ్మహాత్మునకును సూరమాంబికకును, సంగనుఁడఁ బూరుషోత్తమ నాథపాద ।
వంద నానందమహిమ జీవాతుజీవ, నాథుఁడను భావనారాయణాభిధుఁడను ॥

శ్రీసుభద్రా కరుణాకటాక్ష వీక్షాలబ్ధ కవిత్వతత్త్వ పవిత్రుండనై యుండి
మున్ను ॥ 10

సరసతయుక్ మృదుత్వమును, జక్కదనంబు, సలంక్రియాపరి
స్ఫురణము గల్గియుం బరులఁ బొందిన దుష్కృతియందు రెందునన్ ॥ 19

ఉ॥ లాలితకావ్యసీమ నొకలక్షణ మొప్పక యున్న సత్కవుల్
మేలు గ్రహింపఁ గోరుదురు మించినసత్కృపఁ, గాకవుల్ గడున్,
గ్రేలుదురింతెగాక, సవరింపఁగ నేర్తురె, యంచకైవడిన్
బాలునునీరు నేర్పఱచు నాకము కాకముపొంద నేర్చునే ॥ 20

వ॥ అని యిష్టదేవతా నమస్కారంబును, శిష్టజనపురస్కారంబును దుష్టవితిర
స్కారంబును జేసి యేతత్ప్రబంధభూషణంబునకు నాయకరత్నంబైన శ్రీజగ
న్నాథు దివ్యావతారం బభివర్ణించెద॥ 21

చ॥ జగములు చేసి వేసరి, ప్రజాపతి, సర్వజగంబు లెల్ల ము
క్తిగనిన, నింక నీయుపాయము తీరి సుఖించెదనంచు నెంచి, స
త్త్వగుణగరిష్ఠుఁడైన హరియావారిజసీమ నికామభక్తి ని
ష్ఠ గదురఁ శ్రీశపాదవిలసత్కమలద్వయి నిల్పి కొల్చినన్ ॥ 22

సీ॥ కమలారి నేలు చక్కని నెమ్మొగమునకు మొలక వెన్నెల తేట కిలికి నవ్వు।
కార్మొగుల్పస గెల్వఁగల తనుచ్ఛాయకుఁ బసిమి మించిన మించు, పసిడి శాలు।
మానసీయోగపక్షినభోవీథిక హరిధనూరుచి, కమాతరుణికాంతి।
మండితప్రభ నేత్రపుండరీకములకు మాకరందఝరం బమందకరుణ।

గీ॥ సొగసుపుట్టించఁ ద్రొక్కనిచోట్లు ద్రొక్కు, తేజుగలవాఁగె తెక్క నేవాజిరాజు।
నెక్కి గ్రక్కున నింద్రాధీశ్వరుండు, తామరసగర్భునెదుటఁ బ్రత్యక్షమయ్యె ॥

వ॥ అప్పుడు॥ 24

గీ॥ అజుఁడు మ్రొక్కి, యిష్టమర్థించుటయు, శ్రుతిస్మృతిపురాణతతులు చతురవంది
సముదయములభంగి, నమితభక్తినుతించు, మహితపురుషోత్తమంబు దెలిసి ॥

క॥ కమలభవ! నీవుగోరిన, క్రమమున జంతూత్కరములు గాంచు విముక్తి।
ప్రమదంబ చటికిఁ జనుమని, కమలాధీశ్వరుఁడు పల్కఁ గ్రక్కున నజుఁడున్ ॥

ఉ॥ పొంగుచు, నగ్రభాగమునఁ బూనిక నిల్పిన యాపవాహ్యచ
త్రాంగము నెక్కి యేగి, చెలువారఁగఁ గన్గొనె, నీలభూమిభృ
త్పుంగవభూషితన్, విబుధపూజిత దక్షిణవారిరాశివా
స్తుంగతరంగరావపరిశోభిత, శ్రీపురుషోత్తమస్థలిన్ ॥ 27

ఉ॥ కాంచి, విరించి, మున్ను తనకన్నులకుం బొడగట్టి నట్టియు
ద్భ్యంచితమూర్తి శ్రీవిభుని నచ్చటఁ జూచి కృతార్థవృత్తితా

ప్రాంచితుండై, యనేకనిగమార్థముల న్వినుతించి యుండ, నే
తెంచెఁ బిపాసనోరిగురుఁ దీవ్రతతో, నొకకాకి గ్రక్కునన్ ॥ 28

ఉ॥ కారణవారిపూరితసుఖప్రదరోహిణనామకుండవి
స్ఫారజలంబుఁ ద్రావి, సులభస్థితి సంగముదోఁచి, తత్సని
ష్ఠీక ధరాస్థలిన్ బొరలి, దేహమువీడి, చతుర్భుజత్వ శృం
గారశరీరియై సురలుగన్గొన దివ్యపదంబు చేరెనన్ ॥ 29

క॥ నీలధరాధరవరశిఖ, రాలయగతనీలమాధవాగ్రస్థలసం,
లాలితరోహిణకుండజ, లాలఘుమహిమలు జగములన్నియు నిండెన్ ॥ 30

గీ॥ అపుడు దండధరుండు, నిజాధికార సంశయము మానసమ్మున సందడింప ।
జల్లఁబోయినమోము, నిట్టూర్పువడల బడల, నొడలెల్ల సంతాపభరితముగను

సీ॥ నీలాద్రికరిగి యిందిరఁగూడియున్న శ్రీ నీలమాధవుగాంచి నిభృతభక్తి ।
వినుతించి, ప్రార్థింప, విశ్వంభరాధరుం డతని నంచించి తానప్పటికిని ।
నొసగనంతర్ధాన మొంది క్రమ్మఱ మాళవేంద్రుఁ డింద్రద్యుమ్నుఁ డిద్ధమహిమ ।
నశ్వమేధసహస్రమాహరింపఁ దదంతిమున నవభృథవేళవనధిలోన ॥

గీ॥ మంజుమాంజిష్ఠకాంతిసంపదలఁ బొదలు, కల్పభూజాతమై, తరంగములఁ దేలి ।
వచ్చినధరాధిపుఁడు తెచ్చి సర్గనీయ, తరుమహావేదిపై నిడఁ, దత్క్షణంబ ॥ 32

క॥ నగుమొగము, వాలుకన్నులు, మృగనాభిసదృక్షమైన మేచాయ, మణీ ।
ధగధగితదివ్యభూషలు, తగటువలువ వెలయఁ జక్రధరుండై నిలిచెన్ ॥ 33

గీ॥ స్ఫురితకుండలనీలనిచోళధవళ, దేహవనమాలికోజ్జ్వలదీప్తితతులు ।
నెగల, సర్వాంగమాధురాసమానకీర్తి సత్తఘనుండు, బలుం డహిస్వామియయ్యె ॥

సీ॥ ధవళాబ్జరుచి నేలు, తనకటిశాటికాంచలము లెక్కుడుసిగిల్ సంఘటింప ।
కుంకుమద్యుతులనెగ్గులువట్టు తనమేనిచాయ పద్దిక్కులఁ జౌకళింప ।
అంజనప్రతిభఁ గాదను, తనధమ్మిల్లకాంతులు కటికిచీకటిఘటింప ।
సురధనుఃప్రభకు మించులుచూపు తనమణిభూషణద్యుతులు విస్ఫూర్తిచూప

గీ॥ జనపదార్థజాతములు గోల్చుమనుజతతికిఁ, గల్పితసుశాఖయగుచు, సంకల్పితార్థ
సముదయములిచ్చు కలశాఖిజాతి, శ్రీసుభద్ర, భద్రప్రదాత్రియై ప్రౌఢి, నిలిచె ॥

క॥ త్రిభువన శుభదాయి, రవి। ప్రభము దనుజకోటిహరము భాస్వరలాతా ।
నిభము, సుదర్శనము, మహారభసము ప్రాదుర్భవించె, రథాంచణమై ॥ 36

వ॥ ఇట్లు దైత్యసంహారి చతురూపధారియై నిలిచిన, మొలచినహర్షోత్కర్షంబున
నింద్రద్యుమ్నమహీమహేంద్రుండు, రత్నప్రభాధురంధరంబగు మహోన్నత
ప్రాసాదవివరంబు నిర్మించి ॥ 37

ఉ॥ నారదుఁగూడి బ్రహ్మసదనంబునకుం జని, తత్ప్రతిష్ఠకై ।
వారిజసంభవుం బిలువ, వచ్చి ప్రతిష్ఠయొనర్చె నప్పుడ ।
వ్వారిజనేత్రు, భక్తజనవత్సలు, సంశ్రితదీనలోకమం ।
జారు చతుర్విధాకృతి నుదారవిహారునిఁ బూరుషోత్తముం ॥ 38

వ॥ ఇవ్విధంబున ॥ 39

సీ॥ సకలవేదపురాణశాస్త్రేతిహాసముల్ సందులై యేక్షేత్ర మెగసుఁ బొగడు ।
నాంబుజభవకీటకాంతజీవులకు నే క్షేత్రంబు మోక్షలక్ష్మీప్రదంబు ।
సకృదుచ్చారణమాత్ర వికలీకృతాఘసంఘాతకమై, యేక్షేత్ర మతిశయిల్లు ।
కమలభవాండసంఘములు, వ్రాయిననైనఁ జెప్పఁజెప్ప దేక్షేత్రరాజ ॥

గీ॥ మట్టి శ్రీపురుషోత్తమాహ్వయవిముక్తి, దాయకక్షేత్రమున నీలధరమునందు ।
శ్రుతివినుతదారుదేహముస్సతిధరించి, శ్రీజగన్నాధుఁడుండు వాంఛితములిడుచు॥

## షష్ఠ్యంతములు.

క॥ ఏతాదృశగుణమణిఖద్యోత, ద్యోతప్రతానతోషితలోక ।
వ్రాతనవపద్మనకు, విఖ్యాతోరస్సౌధమధ్యగతపద్మనకుఁ ॥ 41

క॥ శుభమతికి, దివ్యతరబోధభరితసామ్రాట్సహస్రతిమహాయమేధా ।
వభృథసమయార్ణవావిః ప్రభవద్దారవతనుప్రభాసంహతికిన్ ॥ 42

క॥ సకృదుచ్చరితనిజాఖ్యాప్రకటితచాంద్రమసకిరణపాళీబహుధా
వికలీకృతాజవంజవ నిశాంధతమసనివ్హృతికి నిఖిలాకృతికిన్ ॥ 43

క॥ కళ్యాణగుణశ్రీకి, మోచితఖల్యాదుష్టోచపపకంచుకబలసా ।
కల్యాతికల్యఘనసౌ, శీల్యమహానీలశైలశేఖరమణికిన్ ॥ 44

క॥ వైహాయసవీధీగమ, నాహనమహాముకాప్రవర్ధితాతిపిపాసో ।
మోహాపదరిష్టమోచన రోహణవాస్తవికి, నిగమరూఢాగతికిన్ ॥ 45

క॥ కరుణాకల్పున, కురుమణి, తరుణారుణబింబవిశ్రుతస్ఫుటవిలస ।
త్కిరణాలూనోగ్రతమః, పరిణామఫణాఢ్యభుజగపతితల్పునకున్ ॥ 46

క॥ బహుళబ్రహ్మహనసహ, సహరణచణనిత్యతావిభాసిచ్ఛాయా ।
సహితసదాతనపల్లవ, బహుపాద్రూపునకు దళితభవతాపునకున్ ॥ 47

వ॥ సభక్తిప్రణామపూర్వకంబుగా, నే నొనర్చి సమర్పింపంబూనిన శ్రీ విష్ణుపురా
ణంబునకనుక్రమణిక యెట్లనిన :—

శ్రీపరాశరుండు, జగద్ధితార్థంబుగా సంశషట్కసమేతంబైన శ్రీవిష్ణుపురాణంబు
నంగషట్కసమేతంబైన నిగమంబునుబోలె నిర్మించి ప్రియశిష్యుండైన మైత్రే
యమహామునికిం జెప్పె. తత్ప్రకారంబు॥ 48

చ॥ తళుకుమెఱుంగుఁగోరలు, సుదగ్రమహావివృతాస్యగహ్వర
జ్వలితకరాళజిహ్వ, జలజాతభవాండము తూఁట్లుబుచ్చు ను।
జ్జ్వలితసటాచ్ఛటల్, ప్రళయసంజనితస్తనితోద్భటార్భటిన్
గలఁచు ఘనాట్టహాసములుగల్గిన శ్రీనరసింహుఁగొల్చెదన్॥ 49

గీ॥ తెలివి పౌర్వాహ్ణికక్రియల్, దీర్చియధిక,గరిమనాసీనుఁడగుపరాశరమునీంద్రుఁ।
గాంచిమైత్రేయుఁ డత్యంతగౌరవంబు, తనరసాగిలిమ్రొక్కి యిట్లనుచుఁబలికె॥

చ॥ అమితమనీష, వేదములు నంగచయంబులు సర్వశాస్త్రముల్
క్రమమునసభ్యసించితి, సలక్షణయుక్తి, భవత్కృపారసం।
బుమహిమ నెల్లశాస్త్రములఁబూని పరిశ్రమమెక్కుడంచు, సం
దముగ మనీషులెన్నగ మనంబుల నస్నతిఁ ప్రసన్నతన్॥ 51

సీ॥ కలిగె నేలీలజగంబు,క్రమ్మఱ నెట్లుకలుగు యన్మయమయి కానుపించుఁ?
బోడము నెచ్చట,నెందు పోడవణియడఁగు భూతముల ప్రమాణంబు తెలఁపనెంత?
దేవాదిసంభవం బా వసుధాచలసాగర ప్రమితి సంస్థానసరణి।
సవితృప్రభృతికసంస్థాన ప్రమాణముల్ దేవాదివంశసంస్థితులు, మనువు।

గీ॥ లన్నిమన్వంతరములు,కల్పాదికముల,వరుసయుగధర్మములును, దేవర్షి రాజ॥ [యు॥
చరితములు,వేదశాఖావతరణమహిమక్రమము,వర్ణాశ్రమములధర్మములు తెలి

క॥ ఆనతియిమ్మని, నిజ పాదానతుఁడై వేఁడుకొనిన యమ్మైత్రేయున్।
బూనికఁజూచి పరాశరుఁ, డ నందసాంద్రహృదయుఁడై యిట్లనియెన్॥ 53

క॥ భళిభళి, లెస్సతలంచితి, నలఘుఁడుమాతండ్రితండ్రియైన వసిష్ఠుం।
డలవునఁజెప్పినదిప్పుడు, తలఁపునకున్ వచ్చెనీవు తలఁచుటకతనన్॥ 54

క॥ క్రూరగతి కౌశికునిచే, ప్రేరితుఁడగుదనుజుచేత, మృతిబొందెను, వి।
స్వారతపోనిధి శక్తి యు,దారుఁడుమాతండ్రి యనుచునంతయువింటిన్॥ 55

చ॥ విని, వినివిష్టకోపశిఖివిహ్వలచిత్తత, దుష్టదైత్యనా
శనమునకొక్కసత్త్రము, విశంకటలీలనొనర్ప, నగ్నిలో।

ననిమిషవైరికోటి దెగటార్చి, మదీయపితామహుండు, క్ర
న్నన ననుజూచి యిట్లను, మనంబు కృపారసమిశ్రమై తగన్ ॥ 56

ఉ॥ కోపముమాను, నక్కసులకున్ మనకున్ బనియేమి, నీగుణుం
డా పతితుండు గాఁడు, దివిజారులచే నిటులౌట, పూర్వజ ।
న్మాపరిమేయకర్మఫల, మట్లగుటన్ వినుము, మూఢునట్లు క్రో
ధోపహతుండుగాఁడు, ఘనుఁడున్నతబోధముకల్మి పౌత్రకా ॥ 57

క॥ ఎవ్వరినెవ్వరుచంపెద, రెవ్వరుచచ్చెదరు జనులకెల్ల నియతమై ।
నివ్వటిలు పూర్వకర్మం, బెవ్వలనికిఁ జనినఫలమునిచ్చుచు నుండున్ ॥ 58

గీ॥ మనుజకోటి బహుక్లేశముల ఘటించి, నట్టికీర్తితపంబుల నడఁగఁజేయు ।
క్రోధమెన్ని తెఱంగుల, క్రోధియాట, పాతకంబని చెప్పిరి పరమమునులు ॥ 59

క॥ వారిన్ స్వర్గశ్రేయో, వ్యాసేధనిదానమనుచువర్ణింతురు పు ।
ణ్యాసదృశులు, పరమర్షు, లుదాసీనత కోపముడుగవయ్యకుమారా ! ॥ 60

గీ॥ అనపరాధులు దైతేయులగ్నిలోనఁ, గాలిరింతట చాలు నీకగ్నమవని ।
సాధుజనములు నిత్యక్షమాధనాఢ్యు, లడఁగవిందుముగాదె యెందును గుమార॥

వ॥ అని యిట్లు మహాత్ముండైన, అస్మత్పితామహుం డనుశాసించినఁ దద్వాక్య
గౌరవంబున, నపహృతసత్త్రయాగుండనైతి. వసిష్ఠుండును సంతుష్టుండయ్యె
నంత॥ 62

ఉ॥ వారిజసంభవాత్మజుఁడవారితదివ్యతపోధనుండు దే
వారులకెల్లఁ గర్తయగునట్టి పులస్త్యుఁడు వచ్చెనా మహా ।
దారుఁడు మత్పితామహుఁడు సర్ఘ్యమొసంగి, మహార్హపీఠిపై
ధీరతనుంచ, నుండి, సముత్కీర్ణతతో, ననుజూచి యిట్లనున్ ॥ 63

ఉ॥ వైరము మిక్కిలయ్యును, నవార్యతపోధన ! యివ్వసిష్ఠువా ।
గ్గౌరవమూది, తాల్మి మనఁగైకొని నిల్పితిగాన నీవు, స ।
ర్వోరుపురాణసర్గములు యుక్తినెఱింగెదు, మత్కృపారస
స్ఫారకటాక్షవీక్షణవశంబున భాసురధీసమగ్రతన్ ॥ 64

సీ॥ సన్మునీంద్ర ! మదీయసంతతిపైఁగడు, సల్కగల్గియుఁ దెగవైతిగాన ।
వరమిత్తుఁగొనుము, భవ్యపురాణసంహితా, కర్తవయ్యెదు లెస్సగాఁగ, దేవ
తాపారమార్థ్యమంతయు నెఱింగెదు, ప్రవృత్తనివృత్తకర్మసంతతులయందు ।
నీమతివిమలమై నెగడెడు మత్ప్రసా, దాతిశయంబున, ననిపులస్త్యుఁ ।

గీ॥ డానతీయ వసిష్ఠుఁడిట్లనియె నిమ్మ, హాత్ముఁ డానతియిచ్చిన యట్లునీకు।
సర్వమును నగుననియె, నాచందమెల్లఁ, దలఁపునకువచ్చెనిపుడు నీపలుకువలన॥

వ॥ అప్పురాణసంహిత నీకెఱింగించెద ఇజ్జగంబు శ్రీవిష్ణునివలన నుద్భవించె; అతనియంద నిలిచె ; ఇజ్జగంబునకు స్థితిసంయమకర్త యతండ ; ఇజ్జగంబులు సర్విష్ణుఁదేవుండని చెప్పి యప్పరాశరమునీంద్రుఁడిట్లనియె॥ 66

సీ॥ అవికారుఁడై శుద్ధుఁడై నిత్యుఁడై పర, మాత్ముఁడై సర్వజీవాత్ముఁడగుచు।
నిత్యైకరూపుఁడై నిజజగస్థుఁడై పద్మాయతాక్షుఁడై భర్గుఁడగుచు।
దేవుఁడై శ్రీవాసుదేవుఁడై ప్రణవమై, భూరిసృష్ట్యవనాంతకారియగుచు।
నవ్యక్తమై వ్యక్తమై స్థూలసూక్ష్మాత్ముఁడై, యేకరూపుఁడై, యాద్యుఁడగుచు॥

గీ॥ జగములకుమూలభూతుఁడై, సకలలోక, ములకునాధారమై, సర్వమునకు నంత।
రాత్మయై,యణువులకును నణువగుచును, వెలయునేదేవుఁడాదేవు విష్ణుఁగొలుతు॥

వ॥ ఇవ్విధంబున జగదీశ్వరుఁడగు శ్రీ విష్ణుదేవునకు మ్రొక్కి చెప్పెద. తొల్లి దక్షాది మునులకు పితామహుండుచెప్పె. ఆ దక్షాదిమునులు నర్మదాతటంబున సార్వభౌముండగు పురుకుత్సునకుం జెప్పిరి. అప్పురుకుత్సుండు, సారస్వతునకుంజెప్పె నాసారస్వతుండు నాకుంజెప్పె॥ 68

గీ॥పరుఁడు,పరులకుఁబరముఁడై, ప్రబలమహిమఁజెలఁగుపరమాత్ముఁడాత్మసంస్థితుఁడు, వర్ణనాది వినిర్దేశవర్జితుండు, సిద్ధగతి నూర్మిషట్కంబుచెందకుండు॥ [రూప।

## వాసుదేవతత్త్వము.

క॥ జగములలోపలతా, న, జ్జగములుతనలోపలను ప్రశస్తినిలుచుటక।
నిగమాంతవేదులెన్నుదు, రిగణితగతి"వాసుదేవుఁ"డనిమునినాథా॥ 70

వ॥ అవ్వాసుదేవతత్త్వంబు నిత్యంబును, నజంబును, నక్షరంబును, నవ్యయంబును నేకస్వరూపంబును, వ్యక్తావ్యక్తస్వరూపంబును, హేయగుణప్రతిభటంబును, నిర్మలంబుననగు పరబ్రహ్మంబు. ఆ బ్రహ్మంబునకుఁ బురుషుండును, ప్రధానంబును, వ్యక్తంబును, కాలంబును ననునాల్గురూపంబులు, వీనికన్నపరంబయి శుద్ధంబైన యవ్విష్ణుపరమపదంబును సూరిజనంబులు చూతురు; ఇప్పురుష ప్రధానవ్యక్తకాలంబులను బ్రహ్మరూపంబులు ప్రతిసర్గంబునందును వ్యక్తి సద్భావహేతువులై వర్తిల్లు. విష్ణుదేవుండు క్రీడించు బాలకుండునుంబోలె వివిధంబున బహురూపంబులఁ జేష్టించు॥ 71

చ॥ అనయము నిత్యమై సదసదాత్మికమై, యతిసూక్ష్మమైకడున్
ఘనమగుచున్న తత్ప్రకృతి పెద్దలుచెప్పుదురాగమార్థముల్।

గనుఁగొనుచున్ బ్రధానమని, కావుననింతకుఁ గారణమ్మ స
జ్జనసుత యాప్రధానము, నిజంబు తలంపఁ బ్రపంచకోటికిన్ ॥ 72

క॥ అవ్యక్తమనెడునామము, సువ్యక్తంబగుచుఁదనకుఁజొప్పడఁగా, స।
ర్వవ్యాపియై ప్రధానము, దివ్యమహిమ వెలయుచుండు ధీరప్రవరా! ॥ 73

వ॥ ఆప్రధానతత్త్వంబక్షయంబు, నాన్యథాధారం బమేయం బమలంబు, ధ్రువంబు, శబ్దస్పర్శరూపరసగంధరహితంబు, త్రిగుణంబు, జగత్కారణంబు; అనాదిప్రభవాప్యయంబు, వ్యాప్తంబునునని బ్రహ్మవాదులు చెప్పుదురు॥ 74

ఉ॥ రేలుఁబగళ్లునాకసము, పృథ్వి, తమంబు వెలుంగుఁగాక యు
ద్వేలత రేంద్రియంబులకుఁ దెల్లముగాక, నిజప్రధానలీ।
లాలలితుండు పూరుషుఁడు శ్లాఘ్యత బ్రహ్మసమాఖ్యనొప్పుభ
వ్యాలఘుచిత్స్వరూపమహిమాస్పదమై మునిలోకపూజితా ॥ 75

క॥ వెలయఁగవ్యక్తమలీల, ప్రలయంబున నణఁగి మగుడఁ బ్రకృతిభవంబై ।
నిలుచుట నిసర్గమదితా, నలవడు ప్రాకృతమనంగ, నధికస్ఫూర్తిన్ ॥ 76

మ॥ కమలాధీశుఁడు సుమ్ము మౌనివర! యికాలంబుచర్చింప, న
తము లేదాదియులేదు, దీనికి ననూనత్వంబునన్ సర్గసం।
యమసంస్థానము లిందుచేనెపుడు సమ్యక్ప్రవృత్తి సచ్ఛిన్న భా
వములై వర్తిలుఁజువ్వె యెల్లపుడు దివ్యల్లీలసంధిల్లగన్ ॥ 77

సృష్టిక్రమము.

వ॥ ఇట్లు ప్రవర్తిల్లుచుండ గుణసామ్యంబున నప్పురుషుండు పృథక్సంస్థితుండై యుండ విష్ణుస్వరూపంబైన కాలంబుపరివర్తించు. అప్పుడు పరబ్రహ్మంబును, పరమాత్మయు జగన్మయుండును, సర్వభూతేశ్వరుండును, సర్వాత్మయుఁ పరమేశ్వరుండును నగు శ్రీహరి సర్గకాలంబున స్వేచ్ఛాప్రధానపురుషుల యందుఁ బ్రవేశించి క్షోభంబు నొందించును. అట్లు క్షోభంబునొంది క్షేత్రజ్ఞాధిష్ఠితంబైన ప్రకృతివిశేషంబువలన మహత్తత్త్వంబు పుట్టె. గుణమేళనంబునఁ ద్రివిధంబయ్యె. త్వక్కుచేత బీజంబువలె బ్రధాన తత్త్వంబుచేత మహత్తత్త్వం బావరింపంబడు. అమ్మహత్తత్వంబువలన వైకారికంబును, తైజసంబును, భూతాదియు నన గుణమేలనంబున నహంకారంబు త్రివిధంబై వర్తిల్లును. అందుఁ దామసంబైన భూతాదియను నహంకారంబు వికృతినొంది శబ్దతన్మాత్రంబువలన శబ్దలక్షణంబైన యాకాశంబు పుట్టె. భూతాదిచేత నావరింపఁబడు నయ్యాకాశంబు వికృతినొంది స్పర్శమాత్రంబు పుట్టించె,

దానివలన మహాబలవంతంబై స్పర్శగుణంబైన వాయువుపుట్టె. ఆకాశంబుచే నావరింపఁబడు నావాయువు వికృతినొంది రూపతన్మాత్రంబు పుట్టించె. దాని వలన రూపగుణంబైన తేజంబుపుట్టె. వాయువుచే నావరింపఁబడు నాతేజంబు వికృతినొంది రసతన్మాత్రంబు పుట్టించె. దానివలన రసగుణంబులైన జలంబులు పుట్టె. తేజంబుచే నావరింపఁబడి యాజలంబు వికృతినొంది గంధమాత్రంబు పుట్టించె. దానివలన గంధగుణంబైన పృథివిపుట్టె. ఇది తామసాహంకా రంబువలనఁ బుట్టిన భూతతన్మాత్ర సృష్టియనంబరగు॥ 78

సీ॥ అనఘాత్మ తైజసంబను నహంకారంబు, వలన నింద్రియములు గలిగెనవియుఁ।
జెప్పెద, శ్రోత్రంబు జిహ్వయు నేత్రంబు, నాసిక త్వక్కు-మనంబు ననఁగ।
నాఱును బుద్ధీంద్రియంబులు శ్రవణాదిసిద్ధికై కలిగె నూర్జితము లగుచుఁ।
బరిపాటి వాక్పాణిపాదపాయూపస్థ, ములగు కర్మేంద్రియంబులు మునీంద్ర!

గీ॥ యుక్తి శిల్పాదిసిద్ధికై యొనరు నివియు, వినుమువైకారికం బన విశ్రుతిగను।
నయ్యహంకారమునఁ బుట్టె నఖిలమైన, దేవతాసర్గమీరీతి దెలిసికొనుము॥ 79

వ॥ ఇట్లు వైకారికాహంకారంబు వలన నింద్రియాధిదేవతలుపుట్టిరి. ఆకాశ వాయుతేజస్సలిలపృథువులు శబ్దాదిగుణసంయుతంబులై శాంతంబులును, ఘోరంబులును, మూఢంబులును, విశేషంబులును నై పృథగ్భూతంబులై యుండు, అన్యోన్య సంయోగంబు నొంది ప్రజల సృజించు॥ 80

సీ॥ తెలివితోఁ బూరుషాధిష్ఠితత్వమున, నవ్యక్త మహదనుగ్రహంబువలన।
మహదాదు లత్యంత మహిమ నండంబు నుత్పాదించు,నది పరిపాటి పెద్ద।
యగుచు బుద్బుదతుల్యమై భూతసమితిచే, నభివృద్ధమగు జలాభ్యంతరమున।
బ్రహ్మస్వరూపమై పరగు విష్ణున కది, తలపోయ ప్రాకృతస్థాన మయ్యె॥

గీ॥ నందుఁజతురాననుండయ్యె నబ్జనేత్రుఁ, డుల్బమునురాచలముజరాయువున గాని।
గర్భజలము సముద్ర సంఘములు నయ్యె,నధికవిస్మయ మొదవ బ్రాహ్మణ వరేణ్య!॥

క॥ గిరిసాగరాంతరీప, స్ఫురితసురాసురమనుష్యపూర్ణములై భా।
సురలీల జగములెల్లన్ ; బరిపాటిం గలిగెనందుఁ బరమమునీంద్రా॥ 82

వ॥ అయ్యండంబు బహిర్భాగంబున నుత్తరోత్తరదశగుణితములైన వారివహ్ని వాయువ్యోమభూతాదిమహదవ్యక్తంబు లనెడు సప్తావరణంబుల చేతను నారికేళఫలాంతర్బీజంబు బాహ్యోపకంబులచేతంబోలెఁ బరివృతంబగుచు నుండు ; అందు రజోగుణకలితుండై విశ్వేశ్వరుండైన హరి బ్రహ్మత్వంబుదాల్చి యాజగత్సృష్టియందుఁ బ్రవర్తించు. సత్త్వగుణకలితుండై సృష్టంబైన

జగంబు విష్ణుత్వంబునం బాలించు; తమోగుణకలితుండై యతి భీషణంబైన
రుద్రరూపంబు దాల్చి యఖిలభూతంబుల భక్షించు; ఇవ్విధంబున॥ 83

సీ॥ అఖిలంబు మ్రింగి యేకార్ణవంబున, నాగ పర్యంకతలమునఁ బవ్వళించి।
యోగనిద్రారూఢినొంది మేల్కనిపున, సృష్టి గావించు స్రష్టత్వ మొంది।
సృష్టిరక్షణనాశకృత్యంబులకు బ్రహ్మ, విష్ణు రుద్రాఖ్యలుద్వృత్తిఁ దాల్చు।
ప్రమదంబుతోడుత భగవంతుఁడగుజనార్దనుఁ డొక్కరుఁడెను వ్యాసమునివరేణ్య॥

గీ॥ భూతములునింద్రియమ్ములుపూరుషుండు,కూడఁగనుపట్టు,జగమునుగుణచయంబు
మహదహంకారములునుశ్రీమత్పయోజ,పత్రనేత్రుండెనుమ్ముతప్పదునిజంబు॥ 84

వ॥ అని చెప్పిన మైత్రేయుం డిట్లనియె॥ 85

గీ॥ అప్రమేయంబు నిర్గుణం బమలతరము, పరము శుద్ధంబు నైనట్టి బ్రహ్మమునకు।
కలిగెనేలీల సృష్ట్యాదికర్తృకత్వ, మానతీయంగవలయు సంయమివరేణ్య॥ 86

వ॥ అనినం బరాశరుం డిట్లనియె॥ 87

సీ॥ యత్నంబు చేయు బ్రహ్మమునకు శక్తులు, సహ్యభావము లెడ సంభవించు।
కొలఁదిడఁగారాక, గోచరింపఁగరాక, సర్గాదివైభవ శక్తులమరుఁ।
బావకునకునెట్లు పరగునుష్ణతి యట్లు, బ్రహ్మంబునకు శక్తి పటిమను వ్వొ।
నారాయణుండు తా నలినాసనుండను, భూమికతాల్చి సంపూర్ణమహిమ॥

గీ॥ నాతనికి నిజమానంబు చేత వర్ష, శతము పరమాయువది రెండు సగములైన।
నొకటిపూర్వ పరార్థమా, నొకటియెన్ని,కొన ద్వితీయపరార్థమా,మునివరేణ్య॥88

## కాలవిభాగము.

చ॥ కనుఁగొన విష్ణురూపమగు కాలము సుమ్మిటులై ప్రవర్తిలున్
మునుపు తదీయవైభవము మోదముతో నెఱిగించినాఁడనీ।
కనఘ! చరాచరంబులకు నన్నిటికిన్ పరిణామకారియై
వినుతికి నెక్కు తత్క్రమము, విస్తరలీల నెఱుంగఁగాఁడగున్॥ 89

వ॥ పదేను నిమేషంబు లొక్కకాష్ఠ, ముప్పదికాష్ఠ లొక్కకళ, ముప్పదికళలొక్క
ముహూర్తంబు. ముప్పది ముహూర్తంబులు మనుష్యమానంబున నొక్క
యహోరాత్రంబు. పదియేనహోరాత్రంబు లొక్కపక్షంబు, రెండుపక్షంబు
లొక్కమాసంబు. ఆఱుమాసంబు లొక్కయయనంబు. అవిదక్షిణోత్తర
సంజ్ఞలం గలరెండు సంవత్సరంబు. అందు దేవతలకు దక్షిణాయనంబు
రాత్రియు, నుత్తరాయణంబు పగలునునగు. ఇట్లు దేవతా పరిమాణంబునఁ

బండ్రెండువేల వర్షంబులు కృతత్రేతాద్వాపరకలిసంజ్ఞితంబైనయొక్క చతుర్యుగంబగు. అందు కృతయుగంబునకు నాల్గువేలు. త్రేతాయుగంబునకు మూఁడు వేలు. ద్వాపరంబునకు రెండువేలు. కలియుగంబునకు వేయిదివ్య సంవత్సరంబులని చెప్పుదురు. కృతయుగపూర్వసంధ్య నన్నూఱు, తత్సంధ్యాంశంబు నన్నూఱు, త్రేతాయుగ పూర్వసంధ్యమున్నూఱు, తత్సంధ్యాంశంబుమున్నూఱు; ద్వాపరయుగసంధ్య యిన్నూఱు, తత్సంధ్యాంశంబు నిన్నూఱు, కలియుగ పూర్వసంధ్య నూఱు, తత్సంధ్యాంశంబు నూఱు దివ్యవర్షంబులు. ఇట్లు యుగ సంధ్యా సంధ్యాంశంబులు పండ్రెండువేలు దివ్యవర్షంబులు నొక్క చతుర్యుగంబగు. సంధ్యా సంధ్యాంశంబుల మధ్యకాలంబు యుగాంతం బనంబరగు. ఇట్లు కృతత్రేతాద్వాపరకలిసంజ్ఞలంగల నాల్గుయుగంబులు నొక్క చతుర్యుగంబనంబరగు. అట్టి చతుర్యుగ సహస్రంబు బ్రహ్మకు నొక్క దివసంబగు. అట్టి దివసంబునందు చతుర్దశమనువులు పుట్టుదురు. వారికాలంబు వినుము. సప్తఋషులు సురలుఁ మనువునకును బుత్త్రులైన నృపతులు నేకకాలంబున సృజింపంబడి యేకకాలంబున సంహృతులగుదురు. వీరలకాలంబు డెబ్బదియొక్క దేవతాయుగంబు. అది మనుష్యమానంబున ముప్పదికోట్లునరువదియేడు లక్షలు నిరువదివేలు వత్సరంబు లవిచతుర్దశగుణితంబైన బ్రహ్మకు నొక్క పగలు. అప్పగటి చివర, నైమిత్తికప్రళయం బనంబరగు, అందు॥ 90

చ॥ విలయదవానలచ్ఛటల, వేఁడిమి భూర్భువరాదిలోకముల్
కలయఁగఁ బర్వ, తాపమునఁ గ్రాఁగి, మహర్నిలయుల్ నశిన్ జను।
స్థలమున కేగి రంత, నతిదారుణలీల మహానిలోత్కరం
బులజగ మెల్లముంచె, పరిపూర్ణ మహార్ణవవారిపూరముల్ ॥ 91

క॥ ఆయేకార్ణవమున ఫణి, నాయకశయనమున బద్మనాభుఁడు నెలయున్।
దోయజభవసంజ్ఞ జగం, బాయతగతి మ్రింగి, యోగులభినుతిసేయన్ ॥ 92

వ॥ దినప్రమాణమైన రాత్రిచనినఁదదంతంబున నెప్పటియట్ల జగంబుల సృజించు. ఇట్లు బ్రహ్మకుఁ దత్ప్రమాణంబున వర్షశతంబు పరమాయువగు. అందుసగంబు పూర్వపరార్థంబు నతిక్రమించె. తదంతంబున పద్మకల్పంబన విశ్రుతంబయ్యె. ఇప్పుడు ద్వితీయపరార్థంబునఁ బ్రవర్తిల్లుచున్నది. కల్పంబు వారాహంబనం బరగు నని చెప్పి మైత్రేయునకు శ్రీపరాశరుం డిట్లనియె॥ 93

గీ॥ అనఘచరిత ! యతీతకల్పావసాన, మున నిశానుప్తుఁడై లేచి వనజభవుఁడు।
సత్త్వసమధికుఁడగుచుశూన్యత్వమందు, లోకమీక్షించితనయాత్మలోఁదలంచి॥

వ॥ బ్రహ్మస్వరూపియైన నారాయణుంగూర్చి యమ్మంత్రంబుదాహరించె॥ 95

శ్లో॥ ఆపోనారా ఇతిప్రోక్తా ఆపోవై నరసూనవః ।
అయనంతస్య వాః పూరం తేన నారాయణ స్స్మృతః ॥ 96

క॥ ఆరయ నరసూనులగుట, నారములన జలములమరు, నారములయనం ।
బై రాజిల్లుకతంబున, నారాయణుఁ డనఁగఁ బద్మనాభుఁడు వెలయున్ ॥ 97

వ॥ అనితలంచి విశ్వంభర యంభోంతర్గత యగుట యెఱింగె నప్పుడు॥ 98

సీ॥ తనువు విదర్చ సంస్తబ్ధ తనూరుహాళీ, ద్గతి నజాండంబు రంధ్రములు వ్రోవ ।
వాలధి త్రిప్ప దుర్వారవాతాహతి, నబ్దముల్ వలయాద్రి యవలికేగ ।
ఘుర్ఘురధ్వనిచేయఁ గోటిసంఖ్యాకని, ర్ఘాతారభటిశంక గడలుకొనఁగ ।
అడుగువెట్టిన ఖలోదగ్రఖురాఘతు, ట్టనగేంద్రములైనఁ దునిసిపోవ॥[హిమఁ।

గీ॥ హరియె యజ్ఞత్రయీమయంబైన ఘోణి, రూపధేయంబుదాల్చి, యారూఢమ
దనుజనుస్థానవాసులై మునులుపొగడ, సంభృతోల్లాసభాసియై జలధిఁజొచ్చె ॥

వ॥ ఇట్లు మత్స్యకూర్మాదిరూపంబులుదాల్చి జగద్ధితంబొనర్చు నీశ్వరుండు, యజ్ఞ
వరాహరూపంబుదాల్చి రసాతలగతియైన విశ్వంభరడాసిన నద్దేవియుఁ బ్రణ
మిల్లి భక్తివినయవినమితోత్తమాంగయై యిట్లని నుతించె ॥ 100

గీ॥ శంఖచక్రగదాధరా ! సర్వభూత, మయ ! జగన్నాథ ! నీకునమస్కరింతు ।
ప్రేమతోల్లియు నను నుద్ధరించితి వను, కంప నిప్పుడు నను నుద్ధరింపవయ్య ॥

క॥ ఏమొదలగు భూతంబులు, దామోదర ! తావకాంశధరములుగావే ।
వేమరునీ కిదె మ్రొక్కెద, శ్రీమహిళానాధ యుద్ధరింపుముననున్ ॥ 102

సీ॥ పరమాత్మ ! ప్రకృతిరూపక ! పూరుషాకార, ! మహదహంకారతన్మాత్రభూత ।
కాలేంద్రియాత్మక ! కలుషనాశన ! జనా, ర్దన ! సర్గవిలయసంస్థానకార్య ।
నిపుణ ! గోవింద! మానితగుణాధార, ! నిర్గుణైక ! కొనునాదుమ్రొక్కులివుడు।
తల్లివిదండ్రివి దాతవు భర్తవు, పోషకుండవు జగంబులకునెల్ల ।

గీ॥ లీలనేకార్ణవంబైనవేళ భోగి, భోగపర్యంకతలమునఁ బూర్ణమహిమఁ ।
బవ్వళింతువునీకన్న పరముఁడొకఁడు, కలఁడె, చర్చించిచూడ, జగన్నివాస ! ॥

క॥ వనజాక్ష ! వాసుదేవా, ! నినుగొలువకదొరకనేర్చు నేమర్త్యునకున్ ।
వినుతవిముక్తివధూసం, గనికామసుఖానుభవవిక స్వరలీలల్ ॥ 104

క॥ కనునవి, వినునవి, మనమున ననయముఁదలపోయఁ గొలఁదిదైనవి, బుద్ధిం ।
బనుపడనిశ్చితమైనవి, మునినుతభవదీయరూపములుచర్చింపన్ ॥ 105

క॥ అరయనాధారమై, స్రష్టవై యుపాశ్రి, యంబవై, యాత్మవై నాకునప్రమేయ !
యుందుదువు నీవు,దానిచేనొనరుదేను, మాధవియనంగనత్యంతమహిమవెలయ॥

క॥ జ్ఞానస్వరూపజయ, ! నిత్యానుపమానందగుణ ! జయ ! నిరుపమదయా !
ధీనమనోంబుజ ! జయ, ! లక్ష్మీనారీ రమణ ! జయ ! సమేధితశౌర్యా ॥ 107

వ॥ యజ్ఞంబును, వషట్కారంబును, ఓంకారంబును, అగ్నులును, వేదంబులును, తదంగంబులును, యజ్ఞపురుషుండును, సూర్యాదిగ్రహంబులు, నఖిల నక్షత్రంబులును, మూర్తామూర్తంబులును, దృశ్యాదృశ్యంబులును నీవ; యిట్లుసర్వేశ్వరుండవైన, నీకునమస్కారంబు ॥ 108

చ॥ అని వసుధాపురంధ్రి, వినయాతిశయంబునఁ దన్నునీగతిన్
వినుతులుసేయ మెచ్చి, పృథివీధరుఁడుద్ధత శుద్ధసామని।
స్స్వనఘనఘుర్ఘురారభటి సారెకుఁజేయుచు దంష్ట్రికాంచలం
బునవడినెత్తి తెచ్చె నతిమోదమెలర్పవసుంధరాసతిన్ ॥ 109

చ॥ సురుచిరదంష్ట్రచే, ధరణినుస్థితఁజేసి రమావధూమనో
హరుఁడువిదిర్చె వేదమయమైన శరీరము స్తబ్ధతాతిభీ।
కరవరరోమఘాతములఁ గంజభవాండము తూఁట్లువ్రోవనా
హరి, నడసీయ రోమనిచయాంతర సంస్థితులైననన్మునుల్ ॥ 110

వ॥ జనస్థాననివాసులైన సనందనాదులు భక్తినమ్రకంధరులై ధీరతరోద్ధతేక్షణుండైన యద్ధరాధరుని నిట్లనిస్తుతియించిరి॥ 111

క॥ పరమేశ ! కేశవాచ్యుత, ! వరశంఖగదాసి చక్రవర్ణితబాహా !
పరిఘు ! జగదుద్భవస్థితి, పరిహృతికారణచరిత్ర పాలించుమమున్ ॥ 112

సీ॥వేదముల్పాదముల్,విశదదంష్ట్రికలుయూ,పములు,యజ్ఞములుదంతములు,చితులు।
వక్త్రంబు,జిహ్వాపావకుఁడురోమంబులు, కుశసముత్కరము, లక్షులు, దివంబు।
రాత్రియు, స్థూలశిరంబు బ్రహ్మపదంబు, సకలసూక్తంబులు సటలు, ఘ్రాణ।
మతులహవిస్సు, గండతలముల్స్రుక్కులు, మహితనాదంబు సామస్వరంబు॥

గీ॥ తనువుప్రాగ్వంశ,మఖిలసత్రములుసంధు, లిష్టములుపూర్తములు, చెవులిద్ధమహిమ
వెలయు దేవరవారికి వేదవేద్య, ! యజ్ఞపూరుష ! వికచపద్మాయతాక్ష ॥ 113

ఉ॥ పన్నగశాయి ! భక్తజనపాలనఖేలనలోల ! లీల నీ
యున్నత దంష్ట్రికాగ్రమున నున్నవసుంధర చూడనొప్పె, సం।
పన్నపయోరుహాకరనిమజ్జనకేళికవేళఁ గోరపై
నున్న సమున్నపంకిలపయోరుహిణీనవపత్రమోయనన్ ॥ 114

గీ॥ వింతగ భవత్పదక్రమాక్రాంతమయ్యె,నంతయు,ననంతపదము,శ్రీకాంతకాంత! ।
తావకీనవపుర్వ్యాప్తమైవెలసెను, రోదసీగహ్వరంబు నిర్బాధ మహిమ ॥ 115

వ॥ దేవా! నీవొక్కరుండవే పరమార్థంబవు. నీప్రభావంబున చరాచరాత్మకంబైన జగంబు వ్యాప్తంబయ్యె, జ్ఞానాత్మకుండవైన నీరూపంబైన జగంబు నందఱు బుద్ధిలేక యర్థస్వరూపంబుగాఁ జూచి మోహంబున మునుంగుదురు. కొందఱు జ్ఞానవిదులు శుద్ధచేతస్కులై యిజ్జగంబు జ్ఞానాత్మకంబుగాఁ జూతురు. సర్వాత్మకుండును, పరమేశ్వరుండును నైన నీవు ప్రసన్నుండవై యిద్ధర నుద్ధరించి మాకు సుఖంబు సేయుమనిరంత ॥ 116

చ॥ మొనసి, సనందనాది మునిముఖ్యులు తన్నునుతింపఁ, బద్మలో
చనుఁడు మహార్ణవంబుపయి సాగరమేఖలనిల్పె, నప్డు మే।
దినియు మునుంగదయ్యె, నతిదీర్ఘవిశాలత, నంబురాశిలో
ననువుగ నెప్పటట్ల సమమై తగె, ద్వీపసరిద్ధరాఢ్యమై ॥ 117

మ॥ మును, సర్గాంతమునన్, లయాగ్నిశిఖలం, మోఘక్రియం, గాలి పో
యినభూమీధరకోటి, దివ్యతరభూయిష్ఠప్రభావంబునన్ ।
వనజాతాక్షుఁడు తొంటియట్ల, చెలువొందన్ నిల్పెఁ, బద్మోద్భవుం
డనునామంబు ధరించి తాన మహనీయామోఘసంకల్పుఁడై ॥ 118

వ॥ ఇట్లమోఘవాంఛితుండైన, ధరాధరుండు, బ్రహ్మరూపధరుండును రజోగుణావృతుండునై, భూవిభాగంబు చేసి, సప్తద్వీపంబులు యథాప్రకారంబున నేర్పరించి, భూరాదిచతుర్లోకంబులు తొల్లిటి యట్ల యేర్పరించి, సృజ్యశక్తులు ప్రధానకరణీభూతంబులుగా, సమస్తజనంబుల సృజించెనని శ్రీపరాశరుండానతిచ్చిన మైత్రేయుం డిట్లనియె. 119

క॥ దేవఋషిపితృదనుజమ, ర్త్యావళులన్, వృక్షతిర్యగాదుల నా రా।
జీవభవుఁ డే విధము వాఁ, డై వెలయ సృజించె, చెప్పుమయ్య, తెలియఁగాన్ ॥

మ॥ అనినన్, శక్తికుమారుఁడిట్లనియెఁ గల్పాదిన్ సిసృక్షుత్వచిం
తనఁబద్మాసనుడుండ సర్గమపుడుద్భంబయ్యె, నుద్యత్తమో ।
ఘనమై, బుద్ధివివర్జితంబయి, సమగ్రంబై నగాఖ్యాకమై
వినుతప్రక్రియజూడఁ బెంపెసఁగియుర్వీదేవచూడామణీ! ॥ 121

వ॥ తమంబును, మోహంబును, మహామోహంబును, తామిస్రంబును, అంధతామిస్రంబును, అనునైదు పర్వంబులుగల యవిద్య ప్రజాపతివలనఁ బ్రాదుర్భవించె. అదియ పంచధావస్థితంబై బహిరంతరంబుల, అప్రకాశంబై, సంవృతాత్మకంబై, నగాత్మకంబైన సర్గంబై పుట్టె, ముఖ్యసర్గంబునంబరగె. ముఖ్యంబులుగదా నగాదులు. అప్పుడప్పితామహుం డాముఖ్యసర్గంబవలోకించి

మఱియు సాధకంబైన సర్గాంతరంబు తలంచుచుండ, నతనికిఁ దిర్యక్సర్గం బభివర్తింప నందువల్లఁ దిర్యక్సర్గంబు పశ్వాదులు తమఃప్రాయంబులు, నవేదులు, నుత్పథగ్రాహులు నజ్ఞానులు, జ్ఞానమానులును, అహం మానులును, అంతఃప్రకాశంబులు, పరస్పరావృతంబులు నష్టావింశ ద్విధాత్మకంబులునై పుట్టెను. ఆతిర్యక్సర్గం బస్యసాధకంబుగాఁ దలంచి సర్గాంతరంబు తలంచునజునకు నూర్ధ్వశ్రోతంబు ప్రవర్తించిన నందువలన సాత్త్వికంబైన దేవసర్గంబుపుట్టె. వారు సుఖప్రీతిబహుళులును, బహిరంతరం బుల ప్రకాశులును, అనావృతులును, తుష్టాత్ములునునై వెలుంగుదురు. ఆదేవ సర్గంబుచూచి పరమప్రీతిసంపన్నుండై, పుండరీకాసనుండు వెండియుసర్గాం తరంబు చింతించుచుండ, నర్వాక్ శ్రోతంబు ప్రవర్తింప నందువల్ల తమోరజో ఽధికంబును, దుఃఖబహుళంబును పునఃపునఃకారియు, బహిరంతఃప్రకాశం బునునైన మనుష్యసర్గంబుపుట్టె. బ్రహ్మకు ప్రథమంబు మహత్సర్గంబు. ద్వితీ యంబు తన్మాత్రభూతసర్గంబు. తృతీయంబు వైకారికంబును, నైంద్రియకం బును. చతుర్థంబు ముఖ్యసర్గంబు. పంచమంబు తిర్యక్ సర్గంబు. షష్ఠంబు దేవ సర్గంబు. సప్తమంబు మానుషసర్గంబు. అష్టమం బనుగ్రహసర్గంబు. నవమంబు కౌమారసర్గంబు. ఈతొమ్మిదిసర్గంబులును జగన్మూలహేతువులగునని సంక్షేప ప్రకారంబునఁజెప్పి సవిస్తరంబుగా వినందలంచిన మైత్రేయునకు శ్రీపరాశరుం డిట్లనియె. 122

క॥ ప్రాచీన కర్మభావితు, లై చచ్చుచుఁ బుట్టుచుర్ నిరంతరసంసా।
రాచితులగుదురు, చెప్పఁగ, నీచాదము చిత్తవృత్తి నెఱుగుదు రార్యుల్ ॥ 123

గీ॥ అమరతిర్యఙ్మనుష్యాచరములబొడమఁ, జేయునజునకు మానస సీమఁబుట్టి।
రాత్మజులు,వారిచేజగంబంతయునుస,ముద్ధితంబయ్యెవినుమునన్మునివరేణ్య॥ 124

క॥ జలములలో మునిగిన, యజ్జలజాసను జఘనసీమ, జనియించిరి ని।
శ్చలధైర్యు లసురవరు లతి, బలవంతులు తామసప్రబలమానసులై ॥ 125

క॥ వనజభవుండునుసవు డ, త్తనువిడువఁగ రాత్రియగుచుఁ దనరె నది వినూ।
తనగతి, రాత్రుల బలియుట, దనుజవరులు దానచేసి ధర్మప్రవణా !! ॥ 126

చ॥ అనఘ పితామహుండు వపురంతరమొంది సృజించె, సత్త్వయు
క్తిని, సురకోటి నంత, నిజదేహము త్యక్తముసేయ నాక్షణం।
బున దినమయ్యె, దేవగణముల్ దినభాగమునందు నొందు పెం
పును బలముర్ మునిప్రవర ! పూనె విధాతయు నన్యదేహముర్ ॥ 127

గీ॥ అందుఁ బితరులు జనియింప నబ్జభవుఁడు, విడిచెఁద త్తను వదియును వెలసెనంధ్య
యనఁగ, ద్విజకోటిచే సేవ్యయగుచు నెపుడుబ్రహ్మయునునంత దేహాంతరంబుఁదాల్చె॥

క॥ వినుము రజోధికమగున, త్తనువువలన మనుజకోటి తద్దయుఁ బొడమెన్
వనజజుఁడు విడువ దఁనువది, వినుతజ్యోత్స్నాభిధాన విశ్రుతిఁగాంచెన్ ॥ 129

వ॥ జ్యోత్స్నారాత్ర్యహస్సంధ్యలు నాలుగును బ్రహ్మశరీరంబులుగా నెఱుంగుము. మఱియు రజోమాత్రాత్మికయగు తనువు ధరించియున్న యన్నలినాసనునకు క్షుతంబు వొడమె, నందువలన నంధకారంబునందు క్షుత్క్షాములు విరూపులు శ్మశ్రుముఖులు నైన వారుపుట్టి ధాతంజుట్టుముట్టి, మాంరక్ష రక్ష యనిపలుకుటం జేసి రాక్షసుల నంబరగిరి. కొందఱు భక్షింతమను జక్షణంబు వలన యక్షులనఁ బుట్టిరి. వారి నప్రియంబులం జూచుధాత కేశంబులు విశీర్ణంబులై తలకెక్కి విసర్పించు కతంబున సర్పంబులుపుట్టి హీనంబు లగుట నహులనం బరఁగె. అంత క్రోధావిష్టుండై, జగత్స్రష్ట కపిలవర్ణంబులును నుగ్రంబులును, బిశితాశనంబులగు భూతగణంబుల నిర్మించె నంగంబువలన గంధర్వులను, వయస్సువలనఁ బక్షులను, వక్షంబువలన మేషంబుల, ముఖంబువలన నజంబుల, నుదరంబుల వలననుఁ బార్శ్వంబుల వలనను గోవులను, పాదంబుల వలన నశ్వమాతంగ రాసభగవయ మృగంబులను, నుష్ట్రాశ్వతర న్యంకువులను, రోమంబులవలన ఫలమూలినులగు నోషధులం గల్పించె, నిట్ల కల్పాదిత్రేతాయుగ ముఖంబున నిర్మించి ॥ 130

గీ॥ గోవు నజమును పురుషుండు గొఱియ గుఱ్ఱి, మశ్వతరగర్దభంబులు ననఁగ నేడు।
గ్రామ్యపశువులనధ్వరకార్యమునకు, ధాత నియమించెకుశలసంధాతయగుచు॥131

ఉ॥ ఓపరమర్షివర్య ! కమలోద్భవుఁడధ్వరకార్యభారను
శ్రీపరిమాణామమెుప్ప విభజించె నరణ్యపశువ్రజంబు గాం।
తాపరలీల నెన్నికకు సప్తవిధంబుల భూతధాత్రిపై
శ్వాపదవానరద్విఖురసామజపక్షిజలేచరాహులన్ ॥ 132

సీ॥ ఋక్కువహంబు త్రివృద్రథంతరము ల, గ్నిష్టోమగాయత్రినియమవిధులు।
యజురాగమంబుస్తోమాధ్వరత్రైష్టుభం,బులుబృహత్సామోక్థ్యముల తెఱంగు।
సామంబు జాగతచ్ఛందంబు సోమంబు, వైరూప మతిరాత్రవర్తనంబు।
సమధికాధర్వ మార్యమణమానుష్టుభ, చ్ఛందంబు వైరాజసారసరణి॥

గీ॥ ఘనుఁడు రాజీవభవుఁ డనుక్రమనిరూఢి, యొనర ప్రాగ్దక్షిణప్రతీచోత్తరాస్య।
నీరజంబులవలనఁబూని కెసృజించె, సాంద్రవిభవంబుమీరమునీంద్రచంద్ర॥133

వ॥ ఇట్లు దేవాసురపితృమనుష్యుల నానావిధభూతంబుల సృజించి మఱియు సంక
ల్పంబున యక్షపిశాచగంధర్వాప్సరోగణనరకిన్నరరక్షోవయఃపశుమృగంబుల
నవ్యయవ్యయంబులైన స్థావరజంగమంబుల సృజియించె. ప్రాచీనకర్మం
బులు బీజంబులుగా వేదశబ్దంబులవలన నెఱింగి నామరూపంబులు కల్పించు.
ఇట్లు ప్రతిసర్గంబునందును సిసృక్షాశక్తియుక్తుండై సృజ్యశక్తిప్రేరితుండై
సృజించుచుండునని చెప్పిన మైత్రేయుండిట్లనియె. 134

క॥ మునివర ! యర్వాక్స్రోతో, జనితులుమానవులు వారిజన్మంబులవెం ।
పును వర్ణములునుగర్మము, లనూనగుణములును జెప్పవయ్య తెలియఁగాన్ ॥ 135

వ॥ అనినఁ బరాశరుండిట్లనియె ॥ 136

సీ॥ కల్పించె నాస్యపంకజముల సత్త్వైక, గుణగరిష్ఠులను బ్రాహ్మణులఘనుల ।
కలిగించె వక్షంబువలన రజోగుణా, ధిక్యభాసురుల, క్షత్రియకులజుల ।
నిర్మించె తొడల నున్నిద్రరజస్తమో, వశ్యమానసుల సద్వైశ్యవరుల ।
పుట్టించె పదముల భూయిష్ఠతామస, గ్రస్తవిగ్రహుల శూద్రప్రవరుల ॥

గీ॥ పద్మగర్భుండు యజ్ఞనిష్పాదనార్థ, మనఘవీరలు యజ్ఞసాధనము సువ్వె ।
యజ్ఞములఁ దృప్తులై సురలడిగినపుడు, వృష్టియొనఁగూర్ప బ్రతుకుదు రెల్లప్రజలు ॥

మ॥ వినుతాచారులు, నైజకర్మనిరతుల్, విఖ్యాతధర్ముల్ యశో ।
ధనులంతఃకరణాతినిర్మలులునై ధాత్రీజనుల్ కోరిన ।
ట్లనసర్గంబపవర్గముం గనుచు వేడ్కం బెక్కుకాలంబు లి ।
ట్లనఘ ప్రక్రియనుండ నంతట సమగ్రాశ్చర్య సంపాదియై ॥ 138

క॥ హరిరూపమైన కాలము పరిపాటిం జనులయందుఁ బడవైచు నుని ।
ష్మగపాపబీజ మది యు, ద్ధురగతికడుఁ బ్రబలె బహుళదోషాస్పదమై ॥ 139

గీ॥ కర్మతతులుఫలింపక ధర్మసరణి సాగక, విశేషసిద్ధులు సంభవింప । [కొనియె॥
కపుడుజనసంఘములకు పాపాభిభవము, మించద్వంద్వాదిదుఃఖముల్ ముంచు

క॥ వనగిరిజలకృత్రిమ దుర్గనికరములుపట్టణములు ఖర్వటములువెం ।
పెనయ రచియించియందుల,ననువుపఱచుకొనిరి తగుగృహంబులుతమకున్ ॥141

వ॥ ఇట్లు శీతాతపాదిబాధాప్రశమనంబునకుఁ బ్రతీకారంబుగా గృహాదికంబు నిర్మిం
చుకొని జీవనోపాయంబునకై వ్రీహులు, గోధుమలు,యవలు,అణువులు,తిలలు,
ప్రియంగువులు, ఉదారంబులు, కోద్రవంబులు, సతీనకంబులు, మాషంబులు,
ముద్గంబులు, మసూరంబులు, నిష్పావంబులు, కుళుద్ధంబులు ఆఢకంబులు, చణ
కంబులు, శణంబులు, ననఁబదియేడు విధంబుల గ్రామ్యౌషధులు సంపాదించిరి.

సంబడుదురు. వనంబులు నరుకువాఁడు అసిపత్రవనంబునంబడు. గోఁతియ
లనేలు వాఁడును, మృగవధాజీవియు, వహ్నిజ్వాలాఖ్యంబునం బడుదురు.
మఱియు ననేకవిధ పాపకర్ములనేకవిధ నరకంబులంబడి యధోముఖులై
దుఃఖించుచు దేవతలంజూచుచుందురు. దేవతలును, నధోభాగంబున నర
కమగ్నులగు నానరులంజూచు చుందురు॥ 80

గీ॥ స్థావరంబులు క్రిములు నబ్జములుపక్షు లఖిలపశువులు నరులుధర్మాభిరతులు।
త్రిదశులునుముముక్షులునునన తెలియవరుసనొక్కటొకటికిసహస్రభాగోన్నతములు॥

క॥ వినుజంతుసంతతులుముక్తికి జనునంతకు నిలువవలయు స్వర్గనివాసం।
బునరకవాసమును నిట్లనిచెప్పిరి బ్రహ్మవేత్తలైన మునీంద్రుల్॥ 82

సీ॥ అఘములుచేసి ప్రాయశ్చిత్తవిముఖుఁడై, నరుఁడు ప్రవేశించు నరకవసతి।
పాపంబుకొలఁదినేర్పఱచిరి కరణి ప్రాయశ్చిత్తవిధులు మన్వాదిమునులు।
జనుఁడుపశ్చాత్తాపసంయుక్తుఁడై హరిం, దలపోయఁజెడనిపాతకముకలదె।
సకలతపఃకృచ్ఛ్రచాంద్రాయణాత్మకములై, వెలయుప్రాయశ్చిత్తములకునెల్ల॥

గీ॥ పరమమస్తదురితభీకరము, పుణ్యాకరము, సౌభాగ్యసంపదాకరము, సౌఖ్య
కరము, శ్రీకృష్ణవిభునామవరము, దలఁపనునిరతిచేయమహిమయేమనఁగవచ్చు॥

క॥ రేపునుమాపునుపగలును శ్రీపతినారాయణుని నశేషజగద్ర।
క్షాపాలకునినరుఁడు ప్రీతిగతిఁ దలఁచిపాయు తీవ్రాఘములన్॥ 84

శా॥ శ్రీవిష్ణుస్మరణానుభావమున, ధ్వస్తాఘుఁడై ముక్తికిన్
బోవంబూనిన మానవోత్తమున కింపుల్ సూపునా కావిలో।
కావాసంబుదలంచిచూచిన ఘనంబౌనంతరాయమ్మును
మిన్నా వాచంయమివర్య! సౌర్యాలమతింబీచందమూహించినన్॥ 85

మ॥ జపహోమార్చనముఖ్యకర్మముల కెంతస్థాంసివై చిత్తమ
చ్చుపడన్నిల్పి యనల్పహర్షమున మించుల్చూపు పుణ్యంబు స్వ।
ర్గపతిత్వాదిఫలంబునైనఁ గడువిఘ్నంబంచు భావించు మో।
క్షపదప్రాప్తిమహాఫలంబునకు యోగిప్రస్తుతనామసా॥ 86

గీ॥ అపునరావృత్తి మోక్షదాయకము వాసు, దేవమంత్రజపంబు, భూదేవవర్య।
దానితోసరిపోల్పఁగాఁ దరమె, సుకృత, మనఁగఁ జెడిపోవునాకపృష్ఠాతిశయము॥

సీ॥ కావున రేయుఁబగలును శ్రీవిష్ణుసం, స్మరణంబొనర్చుచు నరుఁడుసకల।
కలుషనిర్ముక్తుఁడై కనఁడెన్నఁడును నర, కములుపుణ్యముపాతకమ్ముననఁగ।

స్వర్గనరకములసంజ్ఞలు సుమ్మున్వ, ర్గము మనస్సంతోషకరము, దుఃఖ।
కరమునరకము స్వర్గమునకు నరకము, నకుఁ గారణములు మనంబునువ్వె॥

గీ॥ కానపుణ్యమనస్కుఁడై కమలనేత్రు, ననుదినంబును మదినెన్నుకొనుచునుండు।
జనుఁడునరకంబునకుఁ బోకశాశ్వతి ప్ర,భావహరిలోకవాస వైభవముఁగాంచు॥

వ॥ విద్యావిద్యల, జ్ఞానాజ్ఞానపర్యాయంబులందు సరికప్రాప్తికారిణియైన యవి
ద్యంబరిహరించి నిఖిలశ్రేయస్సంపాదినియైన విద్యనాశ్రయించవలయు. ఇవ్వి
ధంబునసప్తశైల, సాగర, సరి, ద్వీప, కాననంబైన భూమండలమందును, సర్వ
పాతాళంబును, నరకంబులును, సంక్షేపరూపంబునంజెప్పితి. అనిచెప్పి భువ
ర్లోకాదిలోకంబులు వినఁగోరు మైత్రేయునకు శ్రీపరాశరుం డిట్లనియె. 89

మ॥ రవిచంద్రప్రచుర ప్రభాపటలిచే రంజిల్లి సద్ద్వీపశై
లవనాంభోనిధియైన భూమికివిశాలత్వంబు తానెంత యొం।
తవిశాలత్వము యాకసంబునకుఁ జోద్యంబై ప్రవర్తిల్లు ని।
ట్లవధానంబున నాత్మలోఁ దెలియు దివ్యజ్ఞానభవ్యాశయా॥ 90

సీ॥ ఉర్వీస్థలమునకు నొక్కయోజనలక్ష, మున సూర్యుఁడుండు సోముండురెంట।
మూఁటనక్షత్రసమూహంబు లేనింట, సౌమ్యుఁడేడింటరాక్షస గురుండు।
తొమ్మిదింట ధరాసుతుఁడు పదునొక్కట,సురమంత్రి పదుమూటసూర్యసుతుఁడు।
పదునాలుగింట సప్తర్షిమండలముప, దేనింట నలఘుఁడౌత్తానపాది॥

గీ॥ ఉగ్రకరునకుఁ బదివేలయోజనముల, క్రిందవిపరీతగతి రాహుకేతువసతి।
యివ్విధఁబున గ్రహములు బుక్షములును, దివిప్రవర్తిల్లుకమల సంభవకులీన॥

క॥ సకలజ్యోతిశ్చక్రము నకుమేఢీభూతుఁడగుచునభమున ధ్రువుఁడు।
త్సుకతన్వర్తిలుచుండుం బ్రకటితతేజోవిరాజమానుండగుచున్॥ 92

క॥ తెలియఁగయజ్ఞఫలంబున నలవడునీభూమి దీనియందునె యజ్ఞం।
బులును ప్రతిష్ఠితములగు జలజాతాక్షుండె యిన్నిజగములువిప్రా॥ 93

క॥ ధ్రువునికి నూర్ధ్వంబున, భవ్యవిభవమునఁబొగడుగను మహాశ్లోకము, వి।
ప్రవర! యొకకోటిపాడవున నవిరళగతికల్పవాసులందుందురొగిన్॥ 94

చ॥ అటకు, ద్వికోటియోజనసమంచితమాజనలోకమందు ను
త్కటమతులౌపితామహసుత ప్రవరుల్ సనకాదులుందురు।
చ్చటుల వివేకపాకవిలసద్విమలాశయు లాత్మమానస
స్ఫుటసరసీజసౌధతల సుస్థితపంకజమందిరాసఖుల్॥ 95

క॥ జనలోకమునకునవ్వల నొనరుఁ జతుష్కోటియోజనోత్సేధమునన్ ।
వినుతతపోలోకము సజ్జనుతవైరాజదేవసంఘ వసతియై ॥ 96

వ॥ సూర్యకిరణ దాహవర్జితులై వైరాజనామధేయ దేవతలా తపోలోకంబున నుండుదురు॥ 97

గీ॥ అనుపమంబై తపోలోకమునకుమీఁద నాఱుకోటులపొడవున సతులగతులఁ ।
బొగడుగనుసత్యలోకమద్భుతవిభూతియడరె బ్రహ్మకులోకంబుసదయహృదయ॥

వ॥ ఆసత్యలోకంబున నపునర్జాతకులు వసియింతురు॥ 99

క॥ పాదాభిగమ్యమైభువి నేదివెలయుచుండు దానినెఱుఁగుమునీవ ।
త్యాదృతిభూలోకంబని భూదేవకులాగ్రగణ్యపుణ్యచరిత్రా ॥ 100

వ॥ ఆభూలోక ప్రకారంబు నీకెఱింగించితిం గదాయనిచెప్పి మఱియు నిట్లనియె॥ 101

క॥ మునిసిద్ధసేవితంబై యనఘంబై భూదివాకరాంతర్గతమై
పెనుపొందు భువర్లోకం బనవద్య ద్వితీయలోకమది యేసుమ్మీ ॥ 102

క॥ రవిమండలంబుమొదలుగ ధ్రువమండలిదాఁక, పెంపుతో వెలయుముని ।
ప్రవర! చతుర్దశలక్షము సువరాహ్వయలోక మఖిలసురసేవ్యంబై ॥ 103

సీ॥ భూర్భువస్స్వర్లోకములు మూఁడుకృతకముల్, జనతపస్సత్య సంజ్ఞములుమూఁడు।
నకృతకంబులు, కృతకాకృతకముమహర్లోకంబు, విను మునిలోకవినుత ।
యిట్లుమీఁదేడు క్రిందేడులోకంబులు, సమరుబ్రహ్మాండ మధ్యమునసట్టి ।
యండంబుపైట సప్తావరణంబులు, దశగుణోత్తరములై తనరునవియు ॥

గీ॥ జలదహనమారుతాకాశములునహంక్రి, యామహత్ప్రకృతులుజుమ్మునీమదినిది।
దలఁచుము, కపిత్థబీజసంతతులఁ గప్పు చిప్పచందంబుగాఁగ, నూర్జితవివేక ॥104

క॥ అల కృతకాకృతకాఖ్యం, గలలోకము శూన్యమునను గల్పాంతమునన్ ।
పొలుపరి, చెడునత్యంతిక, ప్రళయంబుననది వివేకపాకనిధానా ॥ 105

గీ॥అకృతకంబులుమూఁడునత్యంతవిలయ, సమయముననాశమొందుసంయమివరేణ్య
కృతకములుమూఁడుకల్పాంతహతములగును, తెలియుమవ్విధమెల్లసందియముదీర॥

వ॥ ఆబ్రహ్మాండంబునకు దశగుణోత్తరంబులై సప్తావరణంబులుండు. అనంతంబగు ప్రధానంబున కంతంబులేదు. ఆప్రధానంబుకదా సమస్తంబునకు హేతుభూతమైన ప్రకృతియనంబరఁగు. ఆప్రకృతియందుఁగోట్యయుత సంఖ్యాతంబులైన యండంబులావృతంబులై యుండు. దారువునందునగ్నియు తిలలయందు తైలం

బునుఖోలి, ప్రకృతియందుఁ బురుషుండు వ్యాపించి చేతనాత్ముండై యుండు, ఈప్రధాన పురుషులిద్దరును నన్యోన్యంబులుం గూడి సర్వభూతాత్మ భూతమైన విష్ణుశక్తినాశ్రయించి పృథసంశ్రయంబులై యుందురు.సర్గకాలంబునఁ బ్రధాన పురుషక్షోభ కారిణియై విష్ణుశక్తివెలయు. ఆవిష్ణుశక్తియ ప్రకృతిపురుషాత్మకం బైన జగంబువహించియుండు. విష్ణుశక్తిసంక్షోభితంబులగు ప్రకృతిపురుషుల వలన మహదాదులు పుట్టు. వానివలన సురాసురాదులు పుట్టి వారిపుత్రపౌత్ర పరంపరలవలన జగంబు పూరితంబయ్యె. బీజంబువలన వృక్షంబుపుట్టి తత్పరం పరలవలన వృక్షషండంబు నిండునట్లు సర్వబీజభూతుండైన శ్రీవిష్ణునివలన జగం బులు పుట్టెంగావున నిజ్జగంబు శ్రీవిష్ణుమయంబు ॥ 107

గీ॥ క్రతువుకర్తయుఁ గ్రియయునుకర్మఫలము, సకలమంత్రంబులుస్రుగాదిసాధనములు।
అరసిచూచినపుండరీకాక్షుఁడనుచు, నాత్మఁదలఁచుమునిజముసంయమివరేణ్య॥

వ॥ అనిచెప్పి శ్రీపరాశరుం డిట్లనియె॥ 109

క॥ విను భానుని యరదము మిం, టనుదొమ్మిదివేల యోజనంబులు పరవై ॥
వెనుపగు నీషాదండము, కనఁదగుఁద ద్విగుణమగుచు గాఢవివేకా ॥ 110

వ॥ ఆసూర్యుని రథంబు క్రిందట నీషాదండంబునందగిలి నూటయేఁబది యేడు లక్షల యోజనంబుల వెడల్పై చక్రంబు వెలయు త్రినాభికంబును, బంచా రంబును, షణ్ణేమికమును, అక్షయాత్మకంబును, సంవత్సరమయంబును నై, కాల చక్రంబు దానియంద ప్రతిష్ఠితంబగు. యుగంబునకుఁ బ్రథమాక్షంబు హ్రస్వంబును ద్వితీయాక్షంబు దీర్ఘంబునునై యుండు. అందుయుగార్థంబు నందగిలి హ్రస్వాక్షంబు, ధ్రువునకు నాధారంబై యుండు. ద్వితీయాక్షంబు యుగార్థంబునందగిలి చక్రసంయుగంబై మానసోత్తరంబునం బ్రవర్తిల్లు. నలుబదేనువేలున్నేనూరు యోజనంబులు ద్వితీయాక్షప్రమాణంబు. ఉభయ యుగార్థంబుల ప్రమాణంబును నక్షప్రమాణంబును నక్షప్రమాణంబ గాయత్రి, బృహతి, ఉష్ణిక్, జగతి, త్రిష్టుప్, పంక్తియనియేడు ఛందంబు లేడును సూర్యుని యరదంబులకు నశ్వంబులయ్యె॥ 111

సీ॥ పాకారినగరి పశ్యోకసార, యనంగ, వివిధసంపదలచే వెలయుచుండు।
యమరాజునగరి సంయమని, సమాఖ్య వి, స్ఫురితవైభవములఁ బొగడుఁగాంచు।
అబ్ధీశునగరి సుధాభిధాన, యనేక, భోగభాగ్యముల విస్ఫూర్తిఁగాంచు
కాబేరినగరి యోగ్యత విభావరి, యన, నిరుపమసౌఖ్య భాసురతఁగాంచు ॥

గీ॥ మానసోత్తరగిరికిఁ గ్రమమునఁ దూర్పు, నందు దక్షిణదిశయందు నబ్ధినాథు।
దిక్తటాంతంబునందు నుదీచియందు, నతుల సద్గుణ గణ్య సంయమివరేణ్య ॥

శా॥ భాతిందూర్పుననుండి దక్షిణదిశాప్రత్యగ్దిశో దగ్దిశా
స్ఫీతద్యోత వితానుఁడై పటుధనుఃక్షిప్తాశుగా శుక్రియల్ ।
చేతోమోదముగాఁ బ్రదక్షిణముగాఁ జిత్రస్థితిం ద్రిమ్మరున్
జ్యోతిశ్చక్ర సమేతుఁడై యెపుడు ఖద్యోతుండు విప్రోత్తమా ॥ 113

వ॥ అహోరాత్ర వ్యవస్థాన కారణంబు భగవంతుండైన హరియకా నెఱుంగుము. ఉత్తరాయణంబు యోగులకు సకలక్లేశ సంక్షయకరంబైన దేవయానపథంబగు మార్గంబు. సర్వకాల ప్రభావుండగు సూర్యునకు నుదయాస్తమయంబులు లేవు. ఏదీవివారి కెచటంగానంబడియె నాదీవివారి కచట నుదయంబు ఎచ్చటం గానంబడక యుండునది యస్తమయంబు. దర్శనాదర్శనంబుల, యుదయాస్తమయంబులు. అర్కుండు శక్రాదుల పురంబులనుండి పురత్రయంబు స్పృశింపుచుండును. పురోభాగంబెంత దవ్వుతపించు పృష్ఠపార్శ్వభాగంబుల యందు నునంత మేర తపించు. ఊర్ధ్వభాగంబున మేరూపరిభాగమున్ననున్న బ్రహ్మసభం దపింపలేఁడు. బ్రహ్మసభాతేజః ప్రతిహతంబులై సూర్యకిరణంబులు మగుడంబడు వినుము॥ 114

చ॥ రవికిరణంబు లెప్పుడును రాత్రులయందు హుతాశుకీలలన్
దలివి వసించు నట్లన పడంపడి వహ్నియు భానుఁ జెందుతా ।
దివములయందు నట్లగుటదీధితి రేలుఁబగళ్లు వహ్నికిన్
రవికిని మిక్కుటంబగు సనాతనధర్మధురీణవర్తనా ॥ 115

వ॥ అగ్ని సూర్యులు పరస్పరాను ప్రవేశంబున నాప్యాయనంబు నొందుదురు ఉత్తరాయణ దక్షిణాయనాత్మకంబగు సంవత్సరంబు దేవతలకు నొక్కయహోరాత్రంబగు. అందు. 116

ఉ॥ తుంబురు నారదాములతి దోహలులై తిన కీర్తిపాడ ది
వ్యాంబుజలోచనాశతములాడ జగంబులు వేడ్కఁగూడన ।
య్యంబరమధ్యవీథిఁ గమలాప్తుఁడు ద్రిమ్మరుసంశుమండలీ
చుంబిత సర్వదిక్కుఁడగుచున్ బడిఁగుమ్మరిసారెకైవడిన్ ॥ 117

గీ॥ ఉష్ణకరుఁడుత్తరాయణం బొందునపుడు,మకరమున కేగునంత కుంభంబునొందు।
మీనమేష వృషంబుల కానుపూర్వి నరుగు,నామీఁదమిథునంబునాశ్రయించు॥

ఉ॥ కర్కటకంబుద్రొక్కి కుతుకంబుదలిర్పఁగ సింహకన్యలం
దార్కొని, త్రాసువై నిలిచి తాలిమి వృశ్చికచాపయుక్తుఁడై ।
అర్కుఁడు దక్షిణాయన పథాధరణమ్మునఁ ద్రిమ్మున్ శుభో
దర్కగతిం, గ్రమాన్వయము దప్పక చెప్పఁగరాని వేడుకన్ ॥ 119

పంచచామరము॥ కొలందిగా ధ్రువుండు మేరుకూటలగ్న కాలచ
క్రలాలితాక్షరూఘుండై వికాసమొప్పఁ ద్రిమ్మరున్ ।
కులాలచక్రనాభియందుఁ గూర్చినట్టి మంటిమ
ద్దలాగునన్ నిరంతరంబు తత్స్థలంబునందగున్ ॥ 120

వ॥ అయనద్వయంబునందును మార్తాండుండు శీఘ్రమందగతుల నడచుకతంబున నహోరాత్రులల్పంబులును, నధికంబులును నై నడచు ॥ 121

సీ॥ పంకజగర్భశాపంబునఁ బ్రత్యహం, బును మృతిఁబొందుచుఁ బుట్టుచున్న ।
నిరుపమోద్ధతులు మందేహాభిధానరా, క్షసులుసంధ్యలవచ్చి సవితఁబట్టి ।
మ్రింగ నూహింతురు మేదినీసురులుసం, ధ్యోపాస్తిసేయుచు నుర్విఁజుచు ।
మేదురప్రణవసమేత గాయత్ర్యభి, మంత్రితార్ఘ్యాంబువుల్ మహితవజ్ర ॥

గీ॥ ధారలై తాకి దైత్యుల తలలుద్రుంచు, మగుడిసంధ్యలఁబుట్టి యిమ్మాడ్కి జత్తు ।
రాతితాయులువారు నిత్యంబునిట్లు, అహిమభానునినడకఁ బ్రాహ్మణవరేణ్య ॥122

ఉ॥ ఆదినివహ్నినిండె ప్రథమాహుతిచేఁ బరితుష్టినొందు ఛా
యాదయితుండు, దాన, దివిజారులడంగుదు రట్లుకానఁబ ।
ద్మోదరమూర్తిభానుఁ గరుణోదధి సంధ్యలఁ గొల్వఁగా దగున్
కాదనికొల్వఁడెవ్వఁడు వికర్తన హంతయతండ ధారుణిన్ ॥ 123

వ॥ ఇట్లు మందేహుల జయించి ॥ 124

గీ॥ లోకరక్షణపరులు సుశ్లోకులధిక, తరతపోధను లత్యంతధర్మపరులు ।
కీర్తనీయులునగు వాలఖిల్యముఖ్య, భూసురులరక్షఁ దెలిపొందిపోవునినుఁడు॥ 125

వ॥ నిమేషకాష్ఠకళాముహూర్త పరిమాణంబులు నీకుంజెప్పితిం గదా. అట్టి ముహూర్తంబులు ముప్పది యహోరాత్రంబు. సూర్యరేఖోదయంబు మొదలుకొని మూడేసిముహూర్తంబులు ప్రాత స్సంగవ, మధ్యాహ్న, పరాహ్ణ, సాయాహ్నసంజ్ఞలం బరఁగు. ఇప్పదేనుముహూర్తంబులు దివం బగు అంతియె రాత్రియగు. ఉత్తరాయణ, దక్షిణాయంబుల నహోరాత్రంబులు వృద్ధిక్షయంబులం బొందు॥ 126

గీ॥ మేషతులలయందు మిహిరుండు వసియింప, సమము రేయిఁబగలు విమలచరిత ।
అగునుదక్షిణోత్తరాయణంబులు కర్కి, మకరములనినుండు మహిమనుండ ॥

వ॥ పదేనహోరాత్రంబులు పక్షంబు, పక్షద్వయంబు మాసంబు. మాసద్వయంబు ఋతువు, ఋతుత్రయంబయనంబు. అయనద్వయంబు సంవత్సరం బగు, వినుము. 128

గీ॥ వరుసనసంవత్సరము బరివత్సరంబు, బ్రాహ్మణోత్తమ యివ్వత్సర మనువత్స।
రమునువత్సరమునునసం బ్రభవముఖ్య, వత్సరములై దుయుగమునవనుధఁబరఁగు॥

వ॥ అందుఁ బ్రథమంబుసంవత్సరంబు, ద్వితీయంబు పరివత్సరంబు. తృతీయంబు ఇవ్వత్సరంబు చతుర్థం బనువత్సరంబు. పంచమంబు వత్సరంబుగా నిట్లు ప్రభవాది పంచవర్షంబులు సౌర, చాంద్ర, నక్షత్ర, సావనమాన వికల్పితం బులై యుగమనంబరఁగు. ఈభూమండలంబునకుఁ గడపలదైన లోకాలోక శైలంబునకు దక్షిణంబును, నుత్తరంబును, వైషువంబును, ననమూఁడు శృంగంబులుగల నడుమేమతాలలయందు మార్తాండుండు వైషువతీ శిఖరం బుననుండ దివారాత్రంబులు సమంబుగానడచు. ఆసమకాలంబు విషువ కాలంబనం బరఁగిపుణ్యకాల మయ్యె. అందు దేవ, పితృదానంబులుచేసి కృతకృత్యులగుదురు. శుక్లపక్షాంతంబు పౌర్ణమాసియనఁ బరఁగు. కృష్ణ పక్షాంతంబు అమావాస్యయనంబరఁగు. ఆపౌర్ణమాసికి రాకయు ననుమతి యును, అమావాస్యకు, సినీవాలియు, కుహువునను నామాంతరంబులు కలవు. మాఘు, ఫాల్గునంబులును, చైత్ర, వైశాఖంబులును జ్యేష్ఠాషాఢంబు లును, శిశిరవసంత గ్రీష్మఋతువులు మూఁడు నుత్తరాయణంబు. శ్రావణ భాద్రపదంబులును ఆశ్వీజ, కార్తికంబులును మార్గశీర్ష పౌష్యంబులును వనువర్షాశరద్, హేమంత ఋతువులు మూఁడును దక్షిణాయనంబనంబరఁగు. 127

చ॥ వరనుతచక్రవాళగిరి నాలుగు దిక్కుల లోకపాలురున్
పరమతపోధనుల్ సుగుణభాసురు లుత్తములున్నతి వ్రతుల్।
దురిత విదూరులుండుదురు దోహలమొప్పఁగఁ గర్దమాత్మజుల్
నిరతము లోకరక్షణమనీష నశేష జగద్ధితార్థులై॥ 128

వ॥ వారలు సుధన్వుండును, శంఖపుండును, హిరణ్యరోముండును, కేతుమంతుం డును ననంబరఁగుదురు. ఉత్తరంబు దేవయానమార్గంబని చెప్పితింగదా; దక్షి ణంబు పిత్రుయానమార్గంబు. అందు నగ్నిహోత్రులైన ఋషులు భూతారం భకారిమైన బ్రహ్మంబు చెప్పుచు సంతతతపో మర్యాదాశ్రితంబులచేతఁ బ్రతియుగంబులయందు బ్రహ్మస్థాపనంబు సేయుచుండుదురు. వారల మార్గం బుగదాదక్షిణంబు. దక్షిణమార్గ ప్రవర్తనులు చచ్చుచుంబుట్టుచు యాతా యాతంబునొంది భూతసంప్లవ పర్యంతంబు నుండుదురు. దేవయానమార్గంబైన యుత్తరాయణంబునందు, ఇంద్రియజయశీలురును, బ్రహ్మచారులును, విమలు లును, సంసారదూరులును, ఊర్ధ్వరేతస్కులును, నైనయుతీశ్వరులు భూతసంప్లవ పర్యంతంబును వసియించి యుండుదురు. వారలులోభంబులేమిని వ్యవాయ వర్జనంబున కామాదిదోష రాహిత్యంబున నమృతంబునం బొందుదురు॥ 129

గీ॥ కమలభవునిపగటి కడపలసకలభూ, తములువిలయ మొందు దానిపేరు ।
భూతసంప్లవంబు భూర్భువస్స్వర్లోక. నాశకరము బ్రాహ్మణవరముఖ్య ॥ 180

చ॥ క్రమగతి బ్రహ్మహత్యయు తురంగమ మేధముచేసినట్టి దు
ర్దమ తమపాపకర్ముఁడును బ్రస్ఫుట పుణ్యచరిత్రుఁడు న్యథా ।
ర్హముఁనిరయంబు నాకమున నంటవసింతురు భూతసంప్లవం ।
బమరిన దాఁక నిత్తెఱఁగులై చను వేదవిధాన పద్ధతుల్ ॥ 181

గీ॥ ధరణినుండి ధ్రువపదముదాఁక భూతసం, ప్లవముచెల్లును ఋషిపదముకన్న ।
ధ్రువపదమునకన్న నవలనైవెలయుశ్రీ, విష్ణుపదము ఘనవివేకధుర్య ॥ 182

సీ॥ బ్రాహ్మణవర! విష్ణుపదమతి దివ్యంబు, తతమున్తృతీయ పదంబు,వ్యోమ ।
మున వెలుంగుచునుండు మననశీలురు యతుల్, పుణ్యపాపంబులు పోవఁద్రోచి।
అందుఁజెందుదురు శోకామయాదులుపున, రాగతుల్లేవుత దాశ్రితులకు ।
సచరాచరంబైన జగమంతయును దాని, యందసంప్రోతమై యమరుచుండు ॥

గీ॥ లోకసాక్షులై వెలుంగుధర్మధ్రువాదు, లునుదాని యందన నిలిచియుంద్రు ।
రనఘమైనజ్ఞానమును వివేకంబును, నందకలవు బాగడనలవి యగునె ॥ 183

మ॥ తెలివిం, దత్పదమంది, యాధ్రువుఁడు, మేధీభూతుఁడై సంతతో
జ్వలతారాగ్రహ చక్రమెల్లపుడు, తేవంద్రిప్పుచుం గాంచెనా
చలమూర్ధోపరి పుష్కరాంతమున నుచ్చైర్ద్వీప్తితో నుండుశ్రీ
లలనాధీశ పదాబ్జపూజన మహోల్లాసస్ఫురన్మూర్తియై ॥ 184

వ॥ విష్ణుపదంబున ధ్రువుండు, అతనియందు సర్వజ్యోతిస్సులు వానియందు మేఘంబులు, వానియందు సంతతవృష్టియునుండు. ఆవృష్టివలన దేవతిర్యఙ్మనుష్య ప్రముఖులకు పుష్టియు నాప్యాయనంబునునగు. యజనంబులయందు నాజ్యాహుతిముఖంబునం బోషితులై దేవగణంబులు వృష్టికారణంబై సర్వభూతస్థితికిహేతు భూతులగుదురు. ఇవ్విధంబున లోకత్రయంబునకు నాధారంబై, యమలాత్మకంబై, తృతీయంబైన విష్ణుపదంబు వృష్టికిఁ గారణంబయ్యె వినుము ॥ 185

మ॥ సిరులొప్పం, బ్రభవించెనందు, నమరశ్రీపీనవక్షోరుహాం
తరవిన్యస్తపటీరకుంకుమ వినోదప్రక్రమస్నాన పిం
జరతాప్రాపిత భూరివారికలితోచ్చైర్భంగ శ్రీకాంఘ్రివి
స్ఫురితాంగుష్ట నుసంగ, గంగ భువనంబుల్ ప్రోవవిప్రోత్తమా ॥ 186

సీ॥ సకలలోకోన్నత స్థానస్థితోత్తాన, పాదిశిరంబుపైఁ బాదుకొనియె ।
బహుతపోవిభవ విభ్రామితమహనీయ శీలసప్తర్షుల నోలలార్చె ।

గళితసుధారసగాగ్రిసతుష్ట బుధశ, శాంకమండలిం గొనియాడఁజేసె ।
కాంచనశైల శృంగనిరూఢ సంతాన, వాటిపరంపర వాడుదీర్చె ॥

గీ॥ అచటినుండి, యసితయలక నందాభిధ, చక్షుభద్రయనెడు సంజ్ఞలమర
నాల్గుదిక్కులకు ఘనప్రభవహియించె, గంగవిమల వాస్తవంగయగుచు ॥ 137

క॥ మేరుగిరిదక్షిణమునఁగ, శారుచి, ప్రవహించు నయ్యలకనందంగా ।
రీరమణీరమణుఁడు వాం, ధారతిఁ దలఁదాల్చె వెక్క సంవత్సరముల్ ॥ 138

చ॥ హరవరమస్తకాంచిత జటావలివెల్వడి, చంద్రమశ్శర
చ్ఛరదశరద్యుతిం దెగడుచక్కని తుంగతరంగ మాలికల్।
ధరణికిఁదారహార రుచిదార్కొనదక్షివార్ధిఁ జొచ్చియు
ద్ధురసగరాత్మజాస్థి తతిదోఁచిన స్వర్గతులైరి వారలున్ ॥ 139

వ॥ ఈ గంగాజలంబుల యందు స్నాతులగు వారలకు సకలపాపప్రణాశనంబును, అపూర్వపుణ్య ప్రాప్తియునగు. తత్తోయంబుల తర్పణంబుచేసిన పితృాదులకుఁ బరమతృప్తియగు. ఆగంగయందు యజ్ఞేశ్వరుండైన పురుషోత్తము యజ్ఞంబులనారాధించి భూపాలకు లిహపరసుఖంబు లనుభవించిరి. తజ్జలస్నానాతి పూతపాపులగు యతీంద్రులు కేశవాసక్త మనస్కులై నిర్వాణంబు నొందిరి. వీనినభిలషించిన జూచిన, నంటిన, నవగాహించినఁ, గీర్తించిన నిగ్గంగసకల భూతంబులం బవిత్రులంజేయు. యోజనశతంబుల నుండియైన గంగానామంబు నుడివిన జన్మత్రయార్జిత పాపంబులడంగు. ఇట్లు సకలలోకపావనియైన గంగకు నుద్భవస్థానంబైన శ్రీవిష్ణుపదంబు తృతీయపదంబుగా నెఱుంగుమనిచెప్పి శ్రీపరాశరుం డిట్లనియె ॥ 140

ఉ॥ ఆకమలాక్షురూపము, నభోంతిము నన్వొలుగొందు శింశుమా
రాకృతితారకామయమునై, మునివల్లభ, దానితోఁకపై
నేకద, యాధ్రువుండు వసియించుట, తారకలన్గ్రహంబులన్।
గైకొని ద్రిప్పుచుండు నతిగాఢసమీరణ పాశబద్ధుఁడై ॥ 141

ఉ॥ ఆరయశింశు మారతనుఁడైన జనార్దనుమానసంబునన్
కోరిభజించు నాధ్రువునకున్సకలగ్రహతారకాళికిన్
సారసపత్రలోచనుఁడు సర్వచరాచర భూతధారి, యా
ధారముగానెఱుంగుము యథాకథనంబిది నీకుఁజెప్పితిన్ ॥ 142

క॥ ఇనుఁడెనిమిది మాసంబుల, తనకరముల, నవనిరసముతగఁ గైకొనినా ।
ల్గునెలల నొసంగునన్నం, బనువుగజీవించు ప్రాణులన్నియు దానన్॥ 143

చ॥ దినమణివాయునాడి మయతీక్ష్ణమయూఖచయంబుచే జలం
బొనరగసోమునందునిడు, నుర్వరసర్వజలంబు లీలగా ।
గొనిఘనసంపక్తిపై విడుచుకూడుక, కాలమనిత్రపయుక్తతగా
ఘనములుభూమిపై విడుచు, గర్జిలుచు న్ననవారి పూరముల్ ॥ 144

సీ॥ కమలాప్తుడాకాశ గంగాంబుపూరముల్, తనమయూఖములగై కొనిపయోదా।
తతులుసోకకయుండ ధరణిపై విడుచుత, జ్జలకణములు పయింజిలుక నరుడు ।
దురితనిర్ముక్తుడై సరకముల్ జుడక, దివమునకేగు భూదేవవర్య ।
మేఘసంవృతిలేక మిహిరుండుగానరా, దివినుండిపడు వారి దివ్యమనెడు ॥

గీ॥ స్నానమనియొప్పుంగు సంయమివర యిది, పాపనాశనమ్ము భవ్యతరము ।
లోకనుతముపుణ్య లోకదాయకము, పుణ్యైకలభ్యమతి రమాకరంబు ॥145

క॥ సరికృత్తిక రోహిణిమృగ, శిరమున రవి మొగులులేక చెలగంగధరపై
దొరగిన జలమదిదిక్కరి, కరగళితముగాగ జగి, ముకులుమములడచున్ ॥146

వ॥ మేఘసముత్సృష్టంబగు జలంబు సకలప్రాణులకు నోషధులకు జీవనకరంబగు. అయ్యోషధులచేత శాస్త్రచక్షువులైన మానవులు యజ్ఞంబు సేయుదురు. అయ్యజ్ఞంబువలన దేవతలకు నాప్యాయనంబగు. ఇట్లు యజ్ఞంబులు, వేదంబులు, వర్ణంబులు, సర్వదేవనికాయంబులు, పశ్వాదులు వృష్టిచేత నన్నసంపన్నులగుదురు. అట్టివృష్టి సూర్యునివలస నిష్పన్నయగు. అట్టి సూర్యునకు ధ్రువుండాధారభూతుండు. ధ్రువునకుశింశుమారంబాధారంబు. శింశుమారంబునకు హృదయస్థుండై, శ్రీనారాయణుండాధారుండై, సర్వభూతంబుల ధరించునని శ్రీపరాశరుం డిట్లనియె ॥ 147

క॥ వినునాల్గువేలమీదట, ననుబదయోజనముల పొడవెక్కువిగు సూ ।
ర్యునిరథము రెండుదిక్కుల, ననయము నిఃవత్సరగతి హరిజన్వనకున్ ॥ 148

వ॥ దేవర్షి, గంధర్వాప్సరో గ్రామణి సర్పరాక్షసులచేత నాదిత్యుండు సతతాధిష్ఠితుండై యుండు. అదియెట్లనిన ధాతయను దేవతయు కృతస్థలయను నప్సరయుఃబులస్త్యుండను ఋషియు, వానుకియను సర్పంబును, రథకృత్తను గ్రామణియు, హేతియను రక్కసుండును తుంబురుండను గంధర్వుండును, నీయేడ్వురును చైత్రమాసంబున సూర్యునిరథంబున వసియింతురు. అర్యముండను దేవతయు, పులహుండను ఋషియు, రథౌజుండను సర్పంబును, పుంజికస్థలయనునచ్చరయు, ప్రహేతియను రక్కసుండును రథనిరుండను గ్రామణియు, నారదుండను గంధర్వుండును నీయేడ్వురు వైశాఖమాసంబున సూర్యునిరథంబుపై వసియింతురు. అరుణుండను దేవతయు, వసిష్ఠుండను ఋషియు, నాగాఖ్యం

బను సర్పంబును, సహజన్యయగు నచ్చరయు, హాహాహాయను గంధర్వుఁడును, వరుణుండను రక్కసుండును, చిత్రుండను గ్రామణియు నీయేడ్వురు జ్యేష్ఠ మాసంబు సూర్యరథంబుపై వసియింతురు. మిత్రుండను దేవతయు, అత్రి యను ఋషియు, తక్షకుండను సర్పంబును, పౌరుషేయుండను రక్కసుండును, మేనకయనునచ్చరయు, హాహాయనుగంధర్వుఁడును, శతస్వరుండను గ్రామణియు నీయేడ్వురు నాషాఢమాసంబున సూర్యునిరథంబుపై వసియింతురు. ఇంద్రుఁడను దేవతయు, విశ్వావసుండను గంధర్వుండును, శ్రోతుండను గ్రామణియు, ఇలా పుత్రుండను రక్కసుండును, అంగిరుండను ఋషియు ప్లమోచనయను నచ్చరయు, సర్పాఖ్యుండను నాగరాజును, నీయేడ్వురును శ్రావణమాసంబున సూర్యునిరథంబుపై వసియింతురు. వివస్వంతుండను దేవతయు భృగుండను ఋషియు, అగ్రసేనుండను గ్రామణియు,అపూరణుండను గంధర్వుండును,అను ప్లమోచయను నచ్చరయు, శంఖపాలుండను సర్పంబును, వ్యాఘ్రుండను రక్కసుండును, ఈయేడ్వురును భాద్రపదమాసంబున సూర్యునిరథంబుపై వసియింతురు. పూషయను దేవతయు, గౌతముండను ఋషియు, ఘృతాచియను నచ్చరయు, సుషేణవ్యుండను రక్కసుండును, రుచియనుగంధర్వుండును, ధనం జయుండను సర్పంబును, పారుండను గ్రామణియు నీయేడ్వురును నాశ్వయు జమాసంబున సూర్యునిరథంబుపై వసియింతురు. పర్జన్యుండను దేవతయు, భరద్వాజుండను ఋషియును. విశ్వావసుండను గంధర్వుండును, ఐరావతుండను సర్పంబును, విశ్వాచి యను నచ్చరయు, సేనజిత్తను రక్కసుండును, చాపాఖ్యుండను గ్రామణియు నీయేడ్వురును గార్తికమాసంబందు సూర్యునిరథంబుపై వసియింతురు.అంశుండను దేవతయు,కాశ్యపుండను ఋషియు,తార్క్ష్యుండను గ్రామణియు, మహాధర్ముండను గంధర్వుండును, ఊర్వశియను నచ్చరయు, చిత్రసేనుండను రక్కసుండును, విద్యుత్తను సర్పంబును, మార్గశీర్షమాసంబున సూర్యునిరథంబుపై వసియింతురు. త్వష్టయను దేవతయు, క్రతుండను ఋషియు పూర్ణాయువను గ్రామణియు, స్ఫూర్జకుండను రక్కసుండును, కర్కోటకుండను సర్పంబును, అరిష్టనేమి యను గంధర్వుండును, పూర్వచిత్తియను నచ్చరయు పుష్యమాసంబున సూర్యునిరథంబుపై వసియింతురు. త్వష్ట యను దేవతయు, జమదగ్నియను ఋషియు, కంబళుండను సర్పంబును, తిలోత్తమయను నచ్చరయు, ప్రపితుండను రక్కసుండును, రుతజిత్తను గ్రామణియు, ధృతియను నచ్చరయు మాఘమాసంబున సూర్యునిరథంబుపై వసియింతురు. విష్ణుండను దేవతయు, విశ్వామిత్రుండను ఋషియు, అశ్వతరంబను సర్పంబును రంభ యను నచ్చరయు, యజ్ఞవేతుండను రక్కసుండును, సూర్యవర్చుండను గంధర్వుండును, సత్యజిత్తను గ్రామణియు, నీయేడ్వురు ఫాల్గుణమాసంబున

సూర్యునిరథంబుపై వసియింతురు. వీరలు లోకప్రకాశనార్థంబు క్రమంబున ద్వాదశమాసాధికారులై విష్ణుశక్త్యుపబృంహితులై వసింతురు. అందుమునులు నుతించుచు, గంధర్వులుపాడుచు, అచ్చరలాడుచు, రక్కసులనువర్తించుచు పన్నగంబులువహించుచు, గ్రామణులు పగ్గంబులు పట్టుచు వసియింతురు. వాలఖిల్యులు పరివేష్టించి యుపాసింతురు. ఈ యేడు తెగలవారును రవి మండలంబున నిలిచి, హిమోష్ణవారివృష్టులకు, దనుతమ సమయంబున హేతువులగుదురని చెప్పిన శ్రీపరాశరునకు మైత్రేయుం డిట్లనియె ॥ 149

సీ॥ ధీరేంద్ర! యీయేడు తెగలవారును, సరసిజోదర దివ్యశక్త్యుపబృంహి। తాత్ములై యాదిత్యు నరదంబుపై నుండి, [1] శీతలోష్ణాంబు వృష్టిముఖకార్య। కారులౌదురని వక్కాణించితిరి భానుఁ, డీశీతవాతాంబు వృష్టులకును। హేతుభూతుండని యెఱిఁగించితిరి,మును విడిన నియమముదోఁచె నెఱుఁగఁజెపుఁడ॥

గీ॥ ఆదియుఁగాక భానుఁడస్తమితుఁ డయ్యె, నుదితుఁ డయ్యెననుచు నుర్విజనము। లెదురు చూడనేల యీపనులేడ్వురలు, తీర్చి రనిన నీనిఁ దెలుపవయ్య ॥ 150

వ॥ అనియడిగిన మైత్రేయునకు శ్రీపరాశరుం డిట్లనియె ॥ 151

క॥ వినుమెంద ఱున్నఁగానీ, దినకరుఁడేముఖ్యుఁ డతని తేజంబున నే। ననగూడు నన్నిపనులును, జనవినుతిమూలగుచు నెపుడుజగములయందున్ ॥ 152

ఉ॥ భూమిసురేంద్ర యిజ్జగముఁబ్రోచుటకై వెలుఁగుచుయుగ్యజు స్సామసమాఖ్య శ్రీవిభుని శక్తి యఘాపము ద్రుంచు జ్యోతిను ద్దామమహావిభూతి సతామసనాపుని నందనసిద్ధి ద వ్యాహృతి వృష్టివాత, మిహికాదు లొసంగును తీవ్రభానుడున్ ॥ 153

క॥ రేవుల ఋక్కులవహంబును, మాపుల సామప్రపంచంబు, మధ్యాహ్నములన్। దీపితయజుస్సూక్తలును మహాపటిమ బ్రోచుచుండు నంబుజబంధున్ ॥ 154

వ॥ సర్గాదియందు శ్రీమన్నారాయణుండు, సృష్ట్యర్థంబు రజోగుణం బవలంబించి, ఋగ్వేదమయుండైన చతుర్ముఖుం డయ్యె. స్థిత్యర్థంబు సత్వగుణంబవలం బించి,యజుర్మూర్తియైన విష్ణుండయ్యె.సంహారార్థంబు తమోగుణం బవలంబించి సామస్వరూపమైన రుద్రుండయ్యె. కావున సామస్వరం బశుచియయ్యె. ఏవం విధ మహిమగల విష్ణుశక్తి సత్వగుణస్థుండైన సూర్యునధిష్ఠించి యుండి వెలుంగం జేయు ॥ 155

చ॥ సమధికవిష్ణుశక్తి పరిసర్పితుఁడై సవితృందు ఘోరసం తమసముబాఱఁద్రోలి, భువనంబులు బ్రోచుచునుండుఁగాని ని

1. శీతాంభోష్ణవృష్టి.

త్యము నుదయంబు, న స్తమయమందుట లేదు త్రయీమయాత్ముఁడ
ర్యముఁడు త్రిమూర్తిరూపుఁడు సురస్తుతిపాత్రము సుమ్మనువ్రతా ॥ 156

చ॥ సుముఖత శుక్లపక్షమున సోముఁడు భాస్కరుభాస్వను ప్రవే
శమహిమ వృద్ధిఁ జెంది శ్యామలపక్షమునన్ గళల్ యథా
క్రమమున దేవతా పితృపరంపరకిచ్చుఁ గళాసుధాశన
ప్రముదితులై సుఖింతురు శుభస్థితివారును ధీరపుంగవా ॥ 157

వ॥ దేవతలకుఁ బక్షతృప్తియు, పితృగణములకు మాసతృప్తియు, మర్త్యులకు నిత్యతృప్తి
యుం జేయుచునర్కుండు ప్రవర్తించు ॥ 158

సీ॥ మూడుచక్రములు సోమునిరథంబునకును, కుందాభములు పది ఘోటకములు ।
కుడికడ నెడమ దిక్కునఁ గట్టనత్తురంగము లారథంబు వేగమునఁ దిరుగుచుఁ ।
దనకునాధార ముత్తానపాదసుతుండుగా దిన మొక్క బుక్షమున నుండి ।
చరియించునవసుధాకిరణుండుసురకోటికి కళలు ద్వావింశ రెండు కళలుచిక్కి ॥ [ణ।

గీ॥ సలిలములు చొచ్చి వీరుదుచ్ఛయము చొచ్చి యర్కమండలిఁ జొచ్చు నయ్యర్కకిర
మొక్కటియె తన్నుఁ గ్రమవృద్ధి నొందఁ జేయ, గగనవీధి యథాపూర్వగతిఁ జరించు॥

వ॥ చంద్రుండు జలవీరుత్సూర్య మండలంబులు చొచ్చిన కాలం బమావాస్యయనం
బరఁగు. అందును వీరుత్తులు ఛేదించిన నొక్క యాకైనం గోసిన బ్రహ్మహత్యా
ఫలంబు నొందుదురు. సౌమ్యులును బర్హిషదులును, అగ్నిష్వాత్తులును, అనఁ
బితరులు మూఁడు తెఱంగులవారలు. వీరల మావాస్యనాఁడ పరాహ్ణకాలం
బున సూర్యగతుండగు సోముని కళాద్వయంబును పానంబు సేయుదురు. అది
స్వధామృతం బనంబరఁగు. అందువలనఁ బరమనిర్వృతిం బొంది, మాసతృప్తు
లగుదురు. ఇట్లు దేవపితృగణంబులం దృప్తులం జేసి యమృతమయంబు లైన
శీతలపరమాణువులచే [1] వీరుదోషధులు నిష్పాదించి వానివలనను బ్రకాశాహ్లా
దంబులవలనను మనుష్యపశు కీటంబుల నాప్యాయనంబు నొందించుచు
హిమాంశుండు కీర్తితుండగుచు నుండు ॥ 160

గీ॥ అవని దేవ పిశంగవర్ణాష్టతురగ, వాహ్యమై, సర్వసన్నాహవంతమై ప్ర ।
శస్తిగాంచిన రథముపైఁ జంద్రసుతుఁడు, బుధుఁడు వెలుగొందు లోకసంపూజ్యుఁడగుచు॥

క॥ సవరూథం బనుకర్ష, స్తనసీయంబష్టభూమి జ తురగవాహ్యం
బవలోకనీయమునునగు, ప్రవిమల రథ మెక్కు రవి తిరంబగుకణఁకణ॥ 162

గీ॥ అరుణసంభవపద్మ రాగారుణాష్ట, తురగ సంవాహ్య కనకబంధుర రథంబు ।
తెలివిడళుకొత్తనెక్కు దేదీప్యమాన, మణివరోద్భాసితగళుండు మంగళుండు॥

1. వివిధదోషాదులు.

చ॥ ధవళహయంబు లెన్మిది యుదగ్రతఁ గట్టిన పైఁడి తేరిపైఁ
దివిజపురోహితుండు సముదీర్ణతతోడ వసించి యేటి యే।
టివరుస నొక్కటొక్కటిగ దివిని రాసులు ద్రొక్కుచుండుఁ బ్రా
భవమున భూజనంబులకుఁ బ్రస్ఫుటశోభనముల్ ఘటించుచున్ ॥ 164

గీ॥ శబలవర్ణంబు లాకాశసంభవములు, నైనయెనిమిదిగుఱ్ఱంబులానియున్న ।
స్యందనంబందముగ నెక్కి మందమంద, గమనమున సూర్యసుతుఁ డేగు గగనవీథి॥

క॥ ఎనిమిదినల్లనిగుఱ్ఱము, లనువుగ వహియించు ధూసరాభరథము వెం।
పెనయంగ నెక్కి రాహువు, దినదినమును నభ్రవీథిఁ దిరుగుచునుండున్ ॥ 166

క॥ ధూమలరుచి లాక్షావ,ర్ణామితవేగంబు లైన నశ్వాష్టకము।
ద్దామగతిఁ బూన్చినరథము, పై మెలఁగున్ గేతువభ్రపథమున నెపుడున్ ॥ 167

వ॥ ఇది నవగ్రహంబుల రథంబుల తెఱంగు ॥ 168

క॥ రవిఁ బట్టి విడుచుఁ బదపడి, ధవళకరునిఁ బట్టి విడుచుఁ దత్పర్వ।
ప్రసరసమయముల రాహువు, దివినవిరతవక్రగమన దీపితుఁడగుచున్ ॥ 169

వ॥ ఈ నక్షత్రగ్రహతారలు, రాసులు నన్నియు ధ్రువునియందు వాతరశ్మి బద్ధం
బులై ధ్రువునిం ద్రిప్పుచు తామునుం దిరుగుచుండు. ఈ ధ్రువాదులకు
నాధారంబు శింశుమారంబని యెఱుంగుము. ఈ శింశుమారదర్శనంబు చేసి
పాపంబులం బాసి యాయుష్మంతులగుదురు ॥ 170

క॥ వనజాతపత్రనేత్రుఁడు, మునిపుంగవ శింశుమారమూర్తిధరుండై ।
వినువీథిఁ దిరుగు నెప్పుడు, వినుము తదీయప్రభావవిశ్రుతమహిమల్ ॥ 171

వ॥ ఆశింశుమారంబునకు నుత్తరహనువున నుత్తానపాదుండును, అధరంబున
యజ్ఞంబును, మూర్ధంబున ధర్మంబును, హృదయంబున నారాయణుండును,
పూర్వపాదంబుల నశ్వినులును, పశ్చిమ పాదంబుల వరుణార్యములును,
శిశ్నంబున సంవత్సరంబును, అపానంబున మిత్రుండును, పుచ్ఛంబున నగ్ని
మహేంద్రకశ్యపధ్రువులును, నుండుదురు. పుచ్ఛాశ్రయంబైన యీనక్షత్ర
చతుష్టయంబును నస్తమయంబు నొందదు. ఇది సమస్తజ్యోతిస్సన్నివేశంబు ॥

॥ భువనములు జ్యోతిరుచ్చయంబులు వనంబు,లద్రులు దిశల్ నదీసముద్రాదికములు।
అస్తినాస్తిపదార్థవేద్యములు, నంబు,జాతనేత్రుండునుమ్మువిఖ్యాతచరిత ॥ 173

॥ అశేష జగన్మూర్తియైన భగవంతుండు జ్ఞానస్వరూపుండుగాని వస్తుభూతుం
డు కాఁడు. కావున జగంబంతయు జ్ఞానస్వరూపంబు ॥ 174

క॥ వినుభూమియనఁగమ్ర్తిక; యనఁగఘటంబనఁగపా లమన చూర్ణమన।
న్వినుతపరమాణువనఁగా, నొనరినయది భూమిగాదెయూహింపంగన్॥ 175

వ॥ అట్లు సచరాచరంబైన జగంబంతయు, జ్ఞానస్వరూపుండైన భగవంతుండు. విశుద్ధంబు, విమలంబును, విశోకంబును, నిరస్తసంగమంబును, ఏకంబును నగు జ్ఞానంబు, పరముండును పరేశుండునునగు వాసుదేవుండు. అతనికన్న నన్యంబు లేదు. ఇది సకల భువనాశ్రితంబగు వాసుదేవాఖ్య జ్ఞానంబు నీకు నెఱింగించితి. 176

క॥ సవనపశుపావకర్త్విగ్, జ్యేవహము స్వర్గఫలసామగీతి స్వర భో।
గవిభూతి గతులు భూదే, వవరా! విష్ణుండనుమ్ము వర్ణింపంగన్॥ 177

క॥ అనిచెప్పిన మైత్రేయుం, డనుమోదరసార్ద్ర హృదయుఁడై యిట్లను నో।
మునివరసర్వము దెలిపితి, రనుకంపముతోడ నాకు నధికప్రతిభన్॥ 178

జడభరతోపాఖ్యానము.

క॥ సుమహిత సాలగ్రామా, శ్రమమున భరతుండు తపము సమ్యగ్భంగిన్।
కమలాక్షుఁగూర్చిచేయుచు, విమలత్వము లేక యెట్లు విస్మృతినొందెన్॥ 179

చ॥ పలుదెసలిచ్చు సంగములఁ బాసి వివిక్తతపోవనంబులన్
నలినదళాక్షు చింతన మనంబునఁ జేర్చి భజించుచున్నయ।
య్యలఘునకాయవస్థయఁట యన్యులు దుర్విషయోగ్ర సత్వని
స్తులవలమాన సంసరణ దుస్తరవార్ధిఁదరింప నేర్తురే॥ 180

క॥ భరతమహీపతి పావన, చరితంబెఱిఁగింపుమయ్య చయ్యననాకున్।
హరిచరణాసక్తుల సచ్చరితంబఘహరముగాదె సంయమితిలకా॥ 181

వ॥ అని యడిగిన మైత్రేయునకు శ్రీపరాశరుండిట్లనియె॥ 182

క॥ భరతుఁడు హరిపదపూజా, నిరతుండంతస్సపత్న నిర్హరణకళా।
విరతుఁడు, ధర్మారంభా, భిరతుఁడు రాజ్యంబుచేసె పృథుదోశ్శక్తిన్॥ 183

మ॥ సుతవిన్యస్తమహీభరుండగుచునా క్షోణీతలాధీశుఁడూ
ర్జితనిర్వాణపదంబు చేరుటకునై శ్రీకాంతకాంతాంఘ్రిలో।
లతరస్వాంతనిరంతరత్వమున సాలగ్రామ తీర్థంబునన్
జితకామాద్యరివర్గుఁడై తపముచేసెన్ శాంతచిత్తంబునన్॥ 184

సీ॥ యజ్ఞేశ సర్వభూతాత్మ భూతాత్మక, యచ్యుతపుండరీకాయతాక్ష
గోవింద సముదరక్షోమానశాసన, మాధవ సకలసంభావనీయ

శ్రీమదనంతపక్షికులేంద్రవాహన, కేశవ నిజజనక్లేశహరణ
కృష్ణ దురాసదాక్షీణతేజోదీప్త, విష్ణుదేవ సమస్తవేదవేద్య ॥

గీ॥ అప్రమేయ వ్యాపీ కేశవయనుచు నెపుడు, పలుకుఁగాని యొకప్పుడుకలలనైన ।
నన్యభాషణములు వల్కఁడఖిలసుగుణ, రాశి కీర్తివిభాసి యారాచతపసి 185

క॥ అగణితమతి న తఁడన్యము, లగుకర్మములాచరింపఁ డాదరలీలన్
భగవత్పూజానిహితము, లగుకర్మము లాచరించు సహరహముతగన్ ॥ 186

క॥ ఒకనాఁడభిషేకార్థం, బకుటిలుఁడా రాచతపసి యతిశుద్ధజలా ।
ధికయగు మహానదికిను, త్సుకమతిచనిచేసెఁ బెంపుతోనిత్య విధుల్ ॥ 187

క॥ అంతర్జలమున లక్ష్మీ, కాంతుపదాంభోజ యుగ్మకము తలఁచుచుని ।
శ్చింతనతఁడుండె విమల, స్వాంతంబున మంత్రరాజజప తత్పరుఁడై ॥ 188

చ॥ అటకుంబిపాసచే నొగిలి యప్పుడు గర్భిణియైన లేడియొ
క్కటిచనుదెంచి ప్రాంశుతటగాధ దురాసదమార్గయైనత ।
త్తటినికినల్లడిగ్గి సముదంచిత లీలఁదదీయవారియు
త్కట గతిఁద్రాగుచుండఁగ, నుదగ్రమహోగ్రతరత్వరార్భటిన్ ॥ 189

క॥ మృగపతిగర్జించిన భీతగతిన్ గడుపవియ, నగసిఖరిణీస్థలిఁ ద । 190
న్మృగిపడివడిమృతి నొందెను, మృగశాబమునీటి దండమెదలుచుఁ బడియెన్ ॥

గీ॥ రాజితదయాంబురాశి యారాచతపసి, దానినప్పుడ యాశ్రమస్థలికిఁ దెచ్చి ।
పెనిచెనదియును దినదినంబునకువృద్ధిఁ, బొదలెసితపక్షశశిరేఖ పోలుపుగలిగి ॥

సీ॥ నటనగా నుటజాంగణమున గంతులువేయు, నురియుచు, నవకుశముష్టి మేయు ।
కండూతిఁ బ్రోఖురాగ్రముల సంగముగోకుఁ, బెఱమృగంబులఁ జూచిబెదరిపఱచు ।
తరుణరసాలపోతముల ప్రక్కలురాయు, పలుమారు కుంజగర్భములదూఱు ।
దూరంబుగానటవీరాజిపడిపోవు, వేవేగమగుడి యావిర్భవించు ॥

గీ॥ కెలనతననీడఁ గన్గొని కేళ్లుదాటు, నేలమూర్కొని పలుమారు నింగిచూచు ।
నలసిశయనించిరోమంథమాచరించుఁ, దరుణమృగశాబమారాచతపసియెదుట ॥

క॥ సుతులపయి సతులపైధన, వితతులపైఁ బ్రేమవిడిచి విపినమునఁదపో ।
వ్రతనియతినున్ననృపముని, యతిమమతవహించెమిగులనామృగముపయిన్ ॥

వ॥ ఒక్కొక్కనాడమ్మృగంబు వనంబునకుం బోయిరాకతడసిన ॥ 194

చ॥ ప్రమదముగూర్చునాదు మృగరత్నముకానకుఁ బోయిరాదువ్యా
ఘ్రముకబళించెనో వృకపరంపర లంపటపెట్టెనోమృగేం ।

ద్రముతినెనో నిజంబుగ వినాశమునొందినచండమైనఁ బ్రా
ణములిఁక నామె యున్నిలుచునా క్షణమాత్రము చిత్రవైఖరిన్ ॥ 195

వ॥ అని తలపోయుచుండు ॥ 196

గీ॥ స్నానతర్పణసంధ్యా ప్రధానవిధులు, మాననీయహరి ధ్యానమంత్రవిధులు ।
పావనాగమసత్కథా పారవిధులు, హరిణలాలనమునఁ బోలవయ్యెమునికి॥ 197

మ॥ పురుషశ్రేష్ఠుఁడతండు సర్వనియమంబుల్మాని యెల్లప్పుడున్
హరిణాసక్తమనస్కుఁడై తిరిగె, వన్యాహారమర్యాదలన్ ।
"హరిణాసక్తమభూదహో నృపమనోవ్యా పారమేతత్సుదు
ష్కరమద్ధా" యని ధీరకోటిపలుకువాచాప్రౌఢిఁ గీర్తింపగన్ ॥ 198

క॥ అనవరతహరిణలాలన, ననుపమితసమాధి భంగమయ్యెనతనికి ।
ల్లననంతఁ గొంతకాలము, చనఁజనఁ బ్రాణప్రయాణ సమయంబైనన్ ॥ 199

ఉ॥ కన్నుల నశ్రుపూరములుగాఁ గుమారికలీల నేణమ
య్యున్నత కీర్తిపై వదనమొయ్యనఁ జేర్చి భృశార్తినుండె నం ।
పన్నమమత్వయుక్తిఁ బలుమారును దన్మృగరూపభావనా
సన్నమనస్కుఁడై విడిచెఁ గాయమున్యాయముగా మహీశుఁడున్ ॥ 200

క॥ నిరతహరిణైక భావన, నరిగాలకతాప సుఁడుపునర్జన్మంబా।
హరిణకులమునన నియెన్, నరజంబూషండ భరతవసుమతియందున్ ॥ 201

వ॥ ఇవ్విధంబున నప్పురుషప్రకాండుండు జంబూషండ భూమండలంబున హరిణంబై
జనియించి జాతిస్మరత్వంబునకలిగి యనూనజ్ఞానయంబున శుష్కపర్ణతృణ
మాత్రంబున శరీరయాత్ర నడుపుచుఁ దొల్లిటి సాలగ్రామాశ్రమమునకు వచ్చి
యచ్చోటను గొంతకాలంబునకు హరిణశరీరంబువిడిచి ॥ 202

ఉ॥ అంబుజగర్భవంశ్య ! వినుమప్పటికిఁ శుచియైన యోగివం
శంబునవిప్రుఁడై యతఁడుజన్మమునొంది లసన్నవేషమ ।
కంబునవేదశాస్త్రములు గాఢమతిన్విరి నభ్యసించి పీ
తాంబరదివ్యపాద జలజాశ్రితి మానసమంచనుండై ॥ 203

గీ॥ గుప్తమహాదాత్ముఁ డాయోగికులవిభుండు,జడునికైవడి నున్నత్తు చందమునను।
బాలురీతిఁబిశాచంబు భంగినుండు, నొరులకెరికఁ దనచర్యయెఱుఁగనీక ॥ 204

సీ॥ నిరుపమసంస్కార వరమలీమసదేహు, ననుకలాంచితబోధ నవగాహు ।
శతరంధ్రమలిన వస్త్రప్రావృతకటీరు, వికటజటీభూత చికురవారు ।

కదళీనపరమాన్నకబలతుల్యోత్సాహు, పరిభూతఘోరాంతరరిసమూహు
సదృశీభవత్తిరస్కారపురస్కారు, దూరతోపాస్తసంసారభారు ॥
గీ॥ ధీరు, కుహనాజడీభూయచారు, నిత్య, విష్ణుచింతనకార్యునా విప్రవర్యుఁ ।
గాంచి జడమతియంచు లోకంబు మిగులఁ, బరిహసించు మహత్త్వ మేర్పఱుపలేక ॥
క॥ జనకుఁడు పరలోకము చెంద, దనభ్రాతృపితృవ్యులడరి దినదినమును నో ।
ప్పనిపనులుపనుప, నతఁడును, జనపనికయొనర్చు మూఢజడుని తెఱఁగునన్ ॥ 206
క॥ పిలిచినఁ బలుకఁడు, పలికినఁ, బలుబూతులుపలుకుఁ దనదుపజ్జకునరుఁడే ।
యలవునను జొరకయుండెఁ, మెలఁగు నతఁడు గూఢగతి సమృద్ధిదలిర్పన్ ॥ 207
గీ॥ పిలిచి కడుపుకూడుపెట్టి చెప్పినపను, లేమినైనఁ జేయునేమిచెప్ప ।
నమ్మహానుభావుఁ డందఱిపనులకు, నిరతిమును మహోపకరణమయ్యె ॥ 208
వ॥ ఇట్లు తనయోగసిద్ధికి సమృద్ధంబు గాకుండ లోకవ్యవహారంబులుమాని నిరంతర
యోగానుభవపరుండగుచు నుండం గొంతకాలంబు చనిన ॥ 209
సీ॥ తుత్రయఁ బేరిటి సౌవీరపతిదుఃఖ, కారణంబైన సంసారసుఖము ।
వైరోసికపిలునిచే రహస్యజ్ఞాన, సారమెఱుంగఁగాఁ గోరియప్పు ।
డిక్షుమతీతటికేగు చోఁ బల్లకి, పట్టఁగ వెట్టికిఁ బట్టినట్టి ।
నరులతోఁ గూడఁ బూర్ణజ్ఞాననిధియైన, యవ్విప్రవరుఁ దెచ్చి యానదండ ॥
గీ॥ మంసమునకెత్తఁ గర్మశేషానుభవము, గావలెనటంచు వాహకగణమునడుమ ।
నిర్వికారత్వమున మోచె నిరభిమాన, మానసీయాత్ముఁ డతఁడు బ్రాహ్మణవరేణ్య ॥
మ॥ ధరణీదేవుఁడు మూఁపు మీఁద శిబికాదండంబు విజ్ఞానని
ర్భరుఁడై తాల్చి యుగప్రమాణమహిమాత్ర ప్రేక్షణుండై పోటయు ।
ద్ధురతన్మెల్లనపోవ వాహకజనుల్ తోడ్తో మహావేగులై
పరిపాటిం బరువెత్తనత్తఱిని నిర్బంధస్థితిం బొందుచున్ ॥ 211
క॥ వాహకులఁ జూచి నరపతి, యోహో యీవిషమగమన మిడుగుఁ డనిననీ ।
సాహసము మాదిగాదు ద్ధు, నీహుఁ డితని చేష్టయనిన నించుక నగుచున్ ॥ 212
మ॥ ధరణీదేవునిఁ జూచి వేసరితివో? దవ్వేగితో? మోచునే
ర్పరయంబాలదొ నీకు? బీవరుఁడవేలా చేసెదాలస్యమీ ।
కరణిన్నీవన నానృపాలకుని జక్కం జూచి భూదేవతా
వరుఁడల్లన్నగి యిట్లు పల్కు విశద వ్యాపారమేపారఁగన్ ॥ 213
చ॥ బలిసినవాఁడఁ గాను, విను పల్లకి మోచినవాఁడఁ గాను, నా
కలవ్వను లేదు నీవరయ కాడినమాట సహించినాఁడనే

నలుగనటన్న రాజనియెనల్లదె పల్లకిదండెమూఁపుపై
బలుపిదెమేననీకిపుడు భారముమోచిన శ్రాంతిపుట్టునే ॥ 214

వ॥ అనిన బ్రాహ్మణుం డిట్లనియె ॥ 215

గీ॥ భూపవరయిప్పుడీ వేమిపోలఁగంటి, పదియొకింగిరు పిదపఁజెప్పెదవుగాని ।
బలనదబలవిచారనిష్పాటితార్థ, మంతియును సూక్ష్మబుద్ధిచే నాకలించి ॥ 216

ఉ॥ పల్లకిమోచినాఁడవిదె పాయదుమూఁపునదండెయంచు నీ
వెల్లరువీనులన్వినఁగ నిప్పుడు పల్కి తరంతెయున్మహీ।
వల్లభ కల్లనుమున్న వినువారథ జనించినయేని, చెప్పెద
దెల్లముగాఁగ నీదగుమనీషతెరంబుగఁ జేయుమేర్పడ ॥ 217

సీ॥ వసుధపై పాదములావానిపై జంఘలువానిపై నూరులువానిపైని ।
కడుపందుమీఁదవక్షము దానిపై బాహులామీఁద స్కంధంబుల మఱియుండు।
స్కంధాశ్రితముశిబికాదండ మిట్లాట ప్రకటింపనాకు భారంబుకలదె।
శిబికపై త్వదుపలక్షిత శరీరమునిల్చె నిన్నునునన్నును నున్నదాని ॥

గీ॥భూతములుమోచునంతియె భూమిపాల,యవియునడుచుగుణప్రవాహమునఁదగిలి।
గుణములును కర్మవశ్యతఁ గూరుఁగన్న,సమితియు నవిద్యఁగలుగునిజంబునుమ్ము॥

వ॥ ఆత్మ శుద్ధుం,డ క్షరుండు, శాంతుండు, ప్రకృతికంటెఁబరుండు, వృద్ధిక్షయ
రహితుండు, అఖిలజంతువులయందు నొక్కరుండై యుండుటంజేసి॥ 219

క॥ బలుపును దరుగును నెఱుఁగిక, నెలకాలము నొక్కతీరుగా నుండంగా।
బలిసితివనియును నన్నున్, బలికితివది యేమియుక్తిఁ బలికితి చెపుమా ॥ 220

వ॥ భూమిపాదజంఘాదులకు నాకు శిబికాభారంబునమంబ శిబికాభారంబు
భూతంబులు వహించుంగాని జంతువులుకావు శిబికయు భూతసంగ్రహంబు,
అదియుమమత్వానుబృంహితంబై భ్రాంతిఁగొలుపునని పలికె యమ్మహాను
భావుండూరకుండిన॥ 221

క॥ నరపతియును శిబికయుతి, త్వరితగతిం డిగ్గనురికి తచ్ఛ్రీపాదాం
బురుహములకెరఁగి నిటలాం, తరమున నంజలిఘటించి నమ్రతఁబలికెన్ ॥ 222

క॥ విడువిడుఁడు శిబికనేమీ, యెడతప్పారించినాఁడ నెఱుఁగకినన్నున్ ।
గడలేనికరుణ, తో నిప్పుడుగావఁగవలయుభువనపూజితచరితా ॥ 223

క॥ నీవెవ్వరేమిటికిఁగా, నీవిధమునునుండవలసె నేమిపనికిఁగా ।
రావలసెనిటకుఁజెప్పుము, కోవిదనుతియనిన విభునకును న్ననిపలికెన ॥ 224

క॥ నే నిట్టివాఁడ ననిభూ, మీనాయక చెప్పఁదగ మె మీరనుశబ్దం ।
బేననుచునాత్మఁబలుకుట, నైమె నెగడుంగాదె యనుచు నమ్మునిపలికెన్ ॥ 225

గీ॥ అవనినాథ యనాత్మయం దాత్మబుద్ధి, నాచరించి యనాత్మోక్తమైన శబ్ద ।
మాత్మభవమంచుఁ బల్కుదురహహ నిజము, తెలియ నాత్మకుశబ్దంబుగలదె చెపుమ॥

క॥ నాలుకదంతోష్ఠంబులు, తాలువులునునిఖిలశబ్దతతిఁ బుట్టింపన్ ।
జాలినహేతువులిట్టి, కీలెఱుఁగరు శబ్దమాత్మకృతమే తలఁపన్ ॥ 227

గీ॥ ఇన్నియును శబ్దజనకైకహేతువులుగ, నొక్కవాక్యయనుచుబల్కునోనృపాల।
యెన్నివిధములనైననిర్లించిచూడ, బలిసితీవను మాటలు పలుకఁ జనదు॥ 228

క॥ తలయును చేతులుమొదలుగఁ, గల యంగప్రతతితోఁ గలుగుశరీరం ।
బలయాత్మకన్న వేఱని, తలఁచిన నేవేఁబిలువఁ దగునయ్యాత్మన్ ॥ 229

గీ॥ పరుఁడునాకన్న నొకఁడున్న భంగినైన, నితఁడొకఁడు నేనొకండనుమతముకలుగు
భూతతతులందునొక్కండ పురుషుఁడుండు, కానినీవెవ్వఁడన జెప్పఁగావశంబె ॥

క॥ నీపల్లకి యిది నీవున్, భూపతి వేమెల్ల మోచుపురుషుల మిదనీ ।
ప్రాపుగలలోకమని యో, భూపాలక తలఁచుటెల్ల బోలదుసుమ్మీ ॥ 231

గీ॥ ధరణివర వృక్షమునఁగల్గి దారువగుచు, శిబికయనఁగనై శిల్పవైచిత్రిచేత ।
నరగనినికి వృక్ష సంజ్ఞయునుదారు,సంజ్ఞయును నింతిలో నెందుచనియెఁజెపుమ॥

గీ॥ నినువృక్షసమారూఢుం,డనికానీ, దారుసూఢుఁడనికానీ, యో ।
జనమనదు శిబికయనఁగా, డన నేటికి దారుసంగ్రహము కాదేమా ॥ 233

క॥ వినుఛత్రశలాకాదుల, కినయుమూభేదంబు సిద్ధమైన నెచటికిన్ ।
జనెఛత్రమనెడున్యాయము, చనునానీయందు బుద్ధిచక్కంగనిసినన్ ॥ 234

ఉ॥ పురుషుడు కాంత గోవ్రజము భోగి విహంగమఘోటకంబుకుం
జరమనుసంజ్ఞలెల్లను గనాజసనల్లభకర్తహేతులో,।
కరచితసంజ్ఞలెన్నికొనఁగా నురిమర్త్యపశుద్రుమాదులె
ల్లరసినవాత్మగాంచు వపురాశ్రితసంజ్ఞలు కర్మకృత్యముల్ ॥ 235

॥ అధిపరాజని భటుఁడనియస్యమైన, వస్తువనియంట తెలియనివార్తనువ్వె ।
నునిశితప్రజ్ఞనరసిచూచిన నివన్ని, నాటకంబులు సంకల్పనామయములు ॥236

జనకుండవు తనయుకునం, దినుఁడవుతండ్రికి సపత్నునకురిపుఁడవు, మ ।
న్ననపత్నికిఁబతి విట్లగు, నినునెవ్వరనంగవలయు నృపవర చెపుమా ॥ 237

గీ॥ శిరము నీవొ, నీది శిరమొ, యయ్యుదరంబు, నీవొ, యుదరమెన్న నీదియొక్కొ ।
అంఘ్రిబాహుముఖ్యమగునంగకములీవొ, అదియె నీదియోమ, హాత్మ చెపుమ ॥

కం॥ తలఁపసమస్తావయవం, బులకున్వేఱైననీవు భూపాలక యే ।
యలవున నేనని చెప్పం, గలవాఁడవు నిపుణబుద్ధిఁ గనుమా తెలియన్ ॥ 239

వ॥ ఇవ్విధంబునఁ దత్వస్థితి విస్తరింప నేనిట్టివాఁడనని యెట్లు చెప్ప నేర్తునని యాబ్రాహ్మణుండు పలికిన పరమార్థసమన్వితంబులగు పలుకులు విని పులకించి యా భూపాల తిలకుం డిట్లనియె ॥ 240

సీ॥ శిబిక నేమోవను శిబికి నాపై లేదు, నాకన్న దేహమన్యంబు శిబిక,
దేహంబు మోచెనింతియు, భూతములకెల్ల, కర్మచోదితవృత్తి కలిగియుండు ।
కర్తవశ్యత గుణగ్రామంబు నిరుగనే, పనిలేదు నాకని పలికితివ్వ
డిదియెల్ల విని నాదుమది విహ్వలించెనో, పరమార్థతత్వజ్ఞ భవముగోసి ॥

గీ॥ కపిలమునిఁ జేరి పరమార్థకలనఁ దెలుతు,ననుచుఁ జనుచోటఁ దెరువున వినుత తత్త్వ
బోధనిధి నిన్నుఁ గంటి నా పుణ్యమహిమ, కలిసి నిరుపేద పెన్నిధిఁ గన్నయట్లు ॥

వ॥ సర్వభూతేశ్వరుండైన విష్ణుండు జగద్రక్షణార్థంబు కపిలుండై యవతరించె. అమ్మహానుభావుండ నన్ను రక్షించుటకు నీరూపంబునఁ బ్రత్యక్షంబగుట సిద్ధంబు. నాకు నెయ్యది పరమార్థంబైన శ్రేయస్సు దాని నెఱింగించి రక్షింపుమని ప్రణతుండైన సౌవీరపతిం జూచి బ్రాహ్మణుం డిట్లనియె ॥ 242

కం॥ ఇలలోఁ బరమార్థార్థం, బులు శ్రేయములెన్నియైన భూవరకలవం ।
దులకోలఁది యెన్నిచూచినఁ, బలుకులు వేయేలయవియుఁ బరమార్థములే ॥ 243

గీ॥ ధరతనయరాజ్యలాభంబు తలఁచి నరుఁడు, దేవతారాధనము చేసి దానిఁగాంచు ।
ధరణినాయక మనసునఁ దలఁచిచూడ, నదియుఁ బరమార్థమైన శ్రేయంబుగాదె ॥

చ॥ తలపఁగ స్వర్గలోకఫలదాయక మౌ క్రతుకర్మమెంచఁగాఁ,
గలిగిన శ్రేయమౌఁగద, యకింపితయోగసమాధినాత్మునిం ।
గలయఁగఁ జేర్చు శ్రేయమది గాదొకొ భూపలలామ వెక్కువా,
క్కుల పనియేమి శ్రేయములకున్ మితి లేదు తలంచిచూచినన్ ॥ 245

వ॥ పరమార్థంబైన శ్రేయస్సు సంక్షేపరూపంబునం జెప్పెద. ఏకుండును, వ్యాపియు, సముండును, శుద్ధుండును, నిర్గుణుండును, ప్రకృతికంటెఁ బరుండును, జన్మమృత్యాది రహితుండును, సర్వగతుండును, నవ్యయుండును, బరమజ్ఞానమయుండును, నామజాత్యాది వియుక్తుండును, నైన పరమాత్ముని నెఱింగిన జ్ఞానంబు పరమార్థంబైన శ్రేయస్సు. అని చెప్పినవిని మనంబున సంచలించి

యిదియేమని విచారించు సౌవీరపతిం జూచి యమ్మహాబ్రాహ్మణుండద్వైతాంతర్గతంబైన యితిహాసంబు గలదు చెప్పెద వినుమని యిట్లని చెప్పం దొడంగె ॥ 246

క॥ ఋభు నామధేయుఁడబ్జ, ప్రభ సతినూభవుఁడు జ్ఞానభానురుఁ డగ్ని ।
ప్రభుఁడొకముని గలఁ డతనికి, నభినుతశిష్యుఁడు నిదాఘుఁడనుముని వెలయున్ ॥

వ॥ పులస్త్యపుత్రుండైన యన్నిదాఘుండు ఋభునకుం బరిచర్యచేసి యతనివలన నవాప్తజ్ఞానతత్త్వుండయ్యును, నద్వైతవాసన లేకయున్న గురుండు విచారించుచునుండె. అంతం గొంతకాలంబునకు నాశిష్యుండు దేవికానదీతీరంబున రమ్యోపవనపర్యంతంబును, సాలవిస్తృతసమృద్ధంబును, పులస్త్యనివాసితంబును నగు నగరాఖ్యపట్టణంబును నివాసంబు చేసెనంత దివ్యవర్ష సహస్రంబులు చనిన ॥ 248

సీ॥ గురుండు శిష్యునిజూడఁ గోరియప్పురికేగి, తద్గృహద్వారంబునం దుండ నిలువ,
వైశ్వదేవము చేసివచ్చి వాకిటనున్న, ఋభునిం గనుంగొని యభినుతించి ।
యన్నిదాఘుఁడు మొక్కి యర్ఘ్యపాద్యములిచ్చి, లోనికిఁ దెచ్చి యాసీనుఁ జేసి
యన్నంబు భుజియించుఁడనుచుఁ బ్రార్థించిన, నాకు నెన్నఁడు కదన్నములు కూడ॥

గీ॥ వనిన మాయింటఁ గలవు, పాయసగుడాపూప, కలితమోదకసాజ్యముఖ్యంబులైన ।
భోజ్యములు పెక్కు నీచిత్తమునకు వచ్చు, వానిఁ గరుణించి భుజియింపవలయుననిన॥

క॥ ఇవియన్నియును కదన్నము, లవహితమతి మృష్టమైన యన్నంబిడుమ ।
న్నవధూటిఁ జూచి యట్టిద, ధవళేక్షణ పెట్టుమని, నిదాఘుఁ డుపలికెన్ ॥ 250

వ॥ నిదాఘుపత్నియునట్ల శుచియై యలంకరించుకొని మృష్టాన్నంబు పెట్టిన యథేచ్ఛంబుగా భుజియించి సుఖాసీనుండై యున్న యమ్మునివరునవలోకించి ప్రశ్రయావనతుండై నిదాఘుండిట్లనియె ॥ 251

సీ॥ మునినాథ తృప్తి యయ్యెనె తుష్టిగల్గెనె యాహారమున మనంబలరెనయ్య ।
యెచ్చోటనునికి పట్టెచ్చోటికరుగఁగాఁ దలఁచినారిప్పు డెవ్వలననుండి ।
వచ్చితిరన్న నెవ్వనికి నాఁకలిగల దతనికన్నము దినన గునుతృప్తి ।
యాఁకలి నాకు లే దడుగ నేటికిఁ దృప్తిదవాను చేఁ బార్థివ ధాతువింక ॥

గీ॥ నాఁకలియు ధాతువు జలంబున రిగిపోవ, దప్పియునుబుట్టు మర్త్యబృందమునకెల్లఁ ।
దెలియనాఁకలి దప్పులు దేహములకు నె, యవియు రెండును నాకు లేవలఘుచరిత ॥ 252

వ॥ క్షుధపుట్టకుండుటం జేసి నిత్యంబు తృప్తియ మనస్స్వాస్థ్యంబు తుష్టియనఁబరఁగు. ఇవిచిత్తధర్మంబులు. పురుషుఁడు వీనిం బొరయండు. నివాసంబెచ్చట యెచ్చోటి

కింబోయెద వెచ్చటనుండి వచ్చితివని యడిగితి, వినుము. పురుషుం డాకాశంబు భంగివ్యాపియు, సర్వగతుండును నగుటంజేసి నీవడిగినప్రశ్నం బర్థవంతంబు కాదు. ఎట్లనినంబోవుటయు,వచ్చుటయు,నివాసంబునునాకులేదనిన నిదాఘుండు మ్రొక్కి పూజించిన నయ్యోగీంద్రుండు యథేచ్ఛంజనియె. నంతసహస్రవర్షంబులు చనినశిష్యునకుం జ్ఞానదానంబు సేయందలంచి ॥ 253

చ॥ ప్రమదమునం ఋభుండు నగరంబునకుం జనుదెంచి బాహ్యదే
శమునకువచ్చినంగసలి శత్క్షుధనున్న నిదాఘుంజూచిని।
క్యముచెపుమయ్య యేకతముగా నిటులుండగనేల యన్నవా
క్యమువిని గానవంబమరంగా ఋభుంజూచి నిదాఘుడిట్లనున్ ॥ 254

గీ॥ వినుముభూపతి వాహ్యాళి వెడలిమగిడి, పురికివచ్చినేగు సమ్మర్దమునకు వెఱచి।
తొలంగియున్నాడననినయ్యల్పలఘు తేజుడనియెమందస్మితసమంచితాస్యుడగుచు॥

క॥ జనపతియెవ్వం డాతని, జనమెయ్యది యనినన దె గజముమీదమహీ।
జనపతిచూడుము వెంటన్, జనునదిజనమనిన యోగిచంద్రుడు పల్కున్ ॥256

క॥ సామజమెయ్యది యెక్కిన, భూమీపతియెట్టివాడు పోలింపుమనన్ ।
సామజముక్రింద మీదన్, భూమీపతివాహ్యవాహములనెఱుగరొకో ॥ 257

వ॥ అనిన యోగీంద్రుం డిట్లనియె ॥ 258

క॥ క్రిందిదిమీదిది యనిపో, లందెలియదునాకు దీనిలావుదెలుపుమీ ।
వందముగననిన మునికుల, బృందారకనాథుడ జూచిప్రియముదలిర్పన్ ॥ 259

చ॥ పలుకకలుమాని యాఋభునిపై నతడెక్కి మునీంద్రమీదని
ట్లలనడువాడురాజు దిగుడై నినువంటిదిసామజంబికం।
దెలియుమటన్న నయ్యలఘు తేజుడనూనతరప్రబోధుడై
యలరుచునిట్లు పల్కెబరమాదరవాక్కులనన్నిదాఘుతోన్ ॥ 260

ఆ॥ ఇదియునాకు దెలియ దెఱిఁగింపుమిదెనీవు, రాజవేను కుంజరంబనైతి ।
నీవనంగనెవ్వరేనననెవ్వరే, ర్పఱపుమనిన నతడుభయమునంది ॥ 261

వ॥ అమ్మహానుభావుని దిగివచ్చి చరణంబులుపట్టుకొని నీవు ఋభుండవుగావలయు నితరులకు నీయద్వైతసంస్కారంబు కలదే? నీపలుకుల నామానసంబు కలంకందేరె. నాభాగ్యవశంబున నిన్నుంగంటినని పలికినఋభుండిట్లనియె ॥ 262

చ॥ పరమవచోవిశేషముల బ్రాహ్మణవర్య! త్వదీయమానసాం
తరవిచికిత్సవాపెడి కతంబునవచ్చితి నే ఋభుండమున్

పరవినొనర్చునీదు పరిచర్యలు మెచ్చినవాఁడగాన ని
ష్ఫురికరుదెంచి తెల్పితిఁ బ్రబోధవిధం బతిసూక్ష్మవైఖరిన్ ॥ 263

వ॥ అనిచెప్పియా ఋభుండు చనియె. నిదాఘుండును గురూపదేశవిశేషంబున
నద్వైతవాసనావాసితుండై సర్వభూతంబుల నభేదంబునఁ జూచి ముక్తుండయ్యె.
సౌవీరనాయక నీవును తుల్యాత్మరిపుబాంధవుండవై సర్వగతంబైన యాత్మ
జ్ఞానంబు భజియింపుము. నభంబొక్కటయ్యును సితాసితభేదంబుల భ్రాంత
దృష్టులకు భిన్నంబై తోఁచినట్లొక్కండైన యచ్యుతుండు భ్రాంతులకు నా
నారూపంబులై తోఁచునని చెప్పిన నారాజు పరమార్థదర్శనుండై భేదదృష్టిని
విడిచె. మైత్రేయ! ఆబ్రాహ్మణుండు జాతిస్మరణాప్తబోధుండై యాజన్మం
బున నపవర్గంబు నొందె ॥ 264

చ॥ భరతనరేంద్రవృత్తము శుభస్థితిఁ జెప్పినఁ బ్రేమవిన్నన
ప్పురుషులకాత్మమోహములు పుట్టవు నిర్మలబుద్ధిచెందు సం
సరణమునందునున్నను బ్రసన్నత ముక్తిఘటించు నంచు భా
స్వరవరకీర్తిశాలియగు శక్తికుమారుఁ డానతిచ్చునన్ ॥ 265

చ॥ జగదుపకారికారి నుతసత్యవచోనిగమామృతాంబుధి
ప్రగుణవిహారిహారి కకుప్ప్రమదాకుచమండలీగళ ।
న్మృగమదసారిసారి నిబిరీసభుజాపరిఖేల నావితా
శ్రగపరివారి వారిరుహపత్రరుహాపరిభావిలోచనా ॥ 266

క॥ ప్రణమన్నిధానధానా, ర్పణమాప్తినిధానదాసరాజద్గజర ।
క్షణగాన, గానవిద్యా, చణ వేణ్వసమానమాన సత్కృతస్థానా ॥ 267

భుజంగప్రయాతము.

మహానీలశైలేంద్ర మాణిక్య శృంగా
గ్రహర్మ్యాంతరావాసరంగన్మనోజ్ఞా
మహాలోక నాయాత మానుష్యకేష్టా
వహోరస్థలీనిత్య వాసీకృతాబ్జా ॥ 268

గద్య ॥ ఇది శ్రీ సుభద్రాకరుణాకటాక్షవీక్షాలబ్ధకవిత్వతత్త్వపవిత్ర వేంకటామాత్య
పుత్ర కందాళ శ్రీరంగాచార్యకృపాపాత్ర సజ్జనమిత్ర, శ్రీహరిగురు చరణారవింద
వందనపరాయణ కలిదిండి భావనారాయణప్రణీతంబైన శ్రీవిష్ణుపురా
ణంబునందుఁ బ్రియవ్రతుని చరిత్రంబును, అతండు నిజపుత్త్రులకు సప్త

ద్వీపంబులు పంచియిచ్చుటయు, జంబూద్వీపేశ్వరుండైన యగ్నీధ్రుని సంతాన ప్రకారంబును, భారతవర్షాది నవవర్ష ప్రమాణంబులును, మేరువు ప్రమాణంబును, జంబూద్వీప ప్రమాణంబును, సప్తసముద్ర, సప్తద్వీప ప్రమాణంబులును, మానసోత్తర చక్రవాళశైల ప్రమాణంబును, సప్తపాతాళ ప్రమాణంబులును, నరకలోకవర్ణనంబును, ప్రాయశ్చిత్తంబులును, సూర్యాదినవగ్రహలోకప్రమాణంబులును, సప్తఋషిధ్రువమండల ప్రమాణంబులును, సూర్యరథగతి ప్రమాణంబులును, ఉత్తరాయణ దక్షిణాయనగతులును, విష్ణుపద లక్షణంబును, భూతసంప్లవ ప్రకారంబును, గంగావతరణప్రకారంబును, ద్వాదశమాసంబుల సూర్యరథంబు నడచుప్రకారంబును, చంద్రాదిరథగ్రహ ప్రమాణంబును, శింశుమారవర్ణనంబును, భరతుని చరిత్రంబును, హరిణలాలనంబును, జడబ్రాహ్మణ చరిత్రంబును, బ్రాహ్మణ సౌవీరపతుల సంవాదంబును, ఋభునిదాఘ సంవాదంబును, ననుకథలంగల ద్వితీయాంశంబునందు ద్వితీయాశ్వాసము ॥ 269



# వి ష్ణు పు రా ణ ము.

## భావనారాయణకృతము.

### తృ తీ యాం శ ము.


ధుర్యనిజనివేదిత
మాధుర్యయుతప్రసాద మహనీయమహా
త్మ్యాధరితజాతిఘనసం
బాధ జగన్నాథ శ్రీసుభద్రానాథా ॥ 1

క॥ శ్రోత్రసుఖకారిణియును, బవిత్రయునగు భవత్కథనువిని, సుస్థిరమై ।
చిత్రముమదికొనరించఁగ, మైత్రేయుఁడుహర్ష సంభ్రమములఁబలికెన్ ॥ 2

చ॥ గురుఁడవు నాపయింగలుగు కూరిమిచేసి సమస్తమేదినీ
ధరసరిదంబురాసుల విధంబు భువస్సువరాదిలోకభా ।
స్వరవిపులత్వముల్, రవినిశాచరముఖ్యనవగ్రహర్క్షసం
చరణమునాగలోకములు చందముచెప్పితి వద్భుతంబుగన్ ॥ 3

వ॥ దేవర్షిదానవాదుల సృష్టియు, చాతుర్వర్ణ్యోత్పత్తియు, సౌత్తానపాది, హైరణ్య
కశిప్వాదుల చరితంబులవింటి, నింక మనువుల మన్వంతరాధిపతుల వినియెద
ననిన శ్రీపరాశరుం డిట్లనియె. 4

గీ॥ ఆఱుమన్వంతరములిప్పుడరిగె వర్తమానమన్వంతరము సప్తమంబునువ్వొ ।
భావిమన్వంతరము లేడునీవువీని, దెలియుమిపుడన్నియును నీకుఁదేటపఱతు॥ 5

వ॥ ప్రథమమనువు స్వాయంభువుండు, ద్వితీయమనువు స్వారోచిషుండును,
అందు నీశ్వరశర్వరి, వపుముఖులు సప్తఋషులు, చైత్రకింపురుషాదులగు
స్వారోచిష పుత్త్రులురాజులు. తృతీయమను వుత్తముండు, ఆమన్వంతరంబు
నందు సుశాంతినామకుండింద్రుండు, సుధాములు, సత్యులు, శివులు, ప్రతర్ద
నులు, వశవర్తులు నననైదు దేవగణంబులు, వసిష్ఠపుత్త్రు లేడ్వురు సప్తర్షులు,
అజాద్యులైన యుత్తమమనుపుత్త్రులు రాజులు. చతుర్థ మనువు తామ

నుండు, ఆమన్వంతరంబునందు సత్యాశ్వాదులు సప్తవింశతి దేవగణంబులు. శిబి నామధేయుండింద్రుండు, జ్యోతిర్ధామాదులు సప్తర్షులు, నరఖ్యాత్యాదులైన తామస మనుపుత్రులు రాజులు. పంచమ మనువు రైవతుండు. ఆ మన్వంతరంబునందు మను నామధేయుండింద్రుండు. అమితాభ వైకుంఠాదులు చతుర్దశ దేవగణంబులు. హిరణ్యరోమాదులు సప్తర్షులు. బలబంధాదులు రైవతపుత్రులు రాజులు. స్వారోచిషోత్తమ తామస రైవతులు నల్వురును ప్రియవ్రతాన్వయసంభవులు. ఆ ప్రియవ్రతుండు విష్ణుదేవు నారాధించి యాత్మవంశసంభవుల నలువురిని మన్వంతరాధిపతులం బడసె. ఆఱవమనువు చాక్షుషుండు. ఆ మన్వంతరంబునందు మనోజవాహ్వయుండింద్రుండు. ఆర్యప్రసూతాదులు పంచదేవతాగణంబులు, సుమేధాదులు సప్తర్షులు. ఊరు, పురు ప్రముఖ చాక్షుష పుత్రులు రాజులు. సప్తమమనువు సూర్యపుత్త్రుండు శ్రాద్ధదేవుండైన వైవస్వతుండు. ఈ మన్వంతరంబునందు ఆదిత్య వసురుద్రాదులు దేవతలు, పురందరాఖ్యుండింద్రుండు. వసిష్ఠ కశ్యపాత్రి జమదగ్ని భరద్వాజ, గౌతమ, విశ్వామిత్రులు సప్తర్షులు. ఇక్ష్వాకు నృగ ధృష్ట శర్యాతి నరిష్యంత నాభాగ వసుమ పృషధ్ర సుమంతులు వైవస్వత పుత్రులు రాజులు. ఈ శేష మన్వంతరంబులయందును సత్త్వమయంబగు విష్ణుశక్తి సర్వోద్రిక్తమై స్థితియందు దేవత్వంబుచేత నధిష్ఠించియుండు. 6

క॥ వింతగ స్వాయంభువము, న్వంతరమున యజ్ఞుఁ డనఁగ హర్షమున రమా ।
కాంతుఁడు డనతారమొందెను, దాంతమునీంద్రానుఁ ప్రతతి తల్లడిలన్ ॥ 7

వ॥ అక్కాలంబున నార్యాంకి మానసులన, దేవతలుపుట్టి మఱియును. 8

గీ॥ వినుము తుష్టియందు విష్ణుండు స్వారోచి, షాంతరమున, నజితుఁ డనఁగఁ బుట్టెఁ ।
దుషిత దేవగణముతో దుష్టదైత్యసం, తతుల కెల్ల గుండె తల్లడిలఁగ ॥ 9

క॥ ఉత్తమమనుకాలమునఁ బ్ర, సత్తి వనర శ్రీవిభుండు సత్యుండనఁగా ।
నుత్తమయగు సత్యకుసం, పత్తి వెలయఁ బుట్టె ధర్మపద్ధతి నడపన్ ॥ 10

క॥ తామసమనువేళ, జగ, త్స్వామి రమావిభుఁడు పుట్టె సాధ్యకు ధన్య ।
శ్రీమించ హరి యనఁగను, ద్ధామ విశద కీర్తిలతలు ధరణిం బర్వన్ ॥ 11

క॥ రైవతమన్వంతరమున, శ్రీవనితావల్లభుఁడు హరియనఁగఁ బుట్టెన్ ।
దేవగణంబులతో, సం, భావనసంభూతియందు మహిమ దలిర్పన్ ॥ 12

మ॥ వినువైకుంఠుఁ డనన్వికుంఠకు సముత్కర్షంబునం బుట్టిన
వ్వనజాతాక్షుఁడు చాక్షుషాంతరమునన్ వైకుంఠసంజ్ఞామరల్ ।

ఘనభక్తింభజియించ దానవచమూగర్వాంధకారంబు లె
ల్లనుజెల్లాచెదరైసనన్ బటుతిమోల్లాస ప్రతాపంబుతోన్ ॥ 13

క॥ వైవస్వతమనువేళను, మానల్లభుఁడదితికిని సమాహితచిత్త ।
శ్రీవెలయు కశ్యపునకుందా, వామనుఁడై జనించె నవ్యప్రతిభన్ ॥ 14

సీ॥ విదళించె నేదేనిపదమలాంగుష్ఠనఖాంకురాగ్రమున బ్రహ్మాండభాండ ।
మోలించెనేదేని, యురుసరోజభవాదిజాతి మహోంబుజాతతుష్టిఁ ।
దేలించెనేదేని వివిధతరంగిణీ త్రిపథగాంబుల సప్తఋషిజటాలిఁ ।
గళనూర్చెనేదేని లలితప్రభావ్యాప్తినాత్మాసనాది మాళ్యగ్రమణుల ॥

గీ॥ నట్టిశ్రీపాదపద్మముదగ్రలీల, ముజ్జగములఁ ద్రిధావ్యస్తముగ ఘటించి ।
బలిని వంచించి భువనముల్జలజనేత్రుఁ. డింద్రమనియిచ్చెమగుడఁబురందరునకు ॥

క॥ అరయంగానీనుస్వాం, తరముల నేడింటఁ బన్నగయనునిమూర్తుల్ ।
ధరణిపయిఁబుట్టి ప్రజలం, బరిపాటింబ్రోచువృద్ధిఁబరఁగుచునుండున్ ॥ 16

క॥ కుశలగతి జగములందున, నిశము ప్రవేశించియుండు నిశ్చయముగ స ।
ర్వాశరణ్యుఁడిట్టులగుట, న్వాశిధాత్వర్థంబునన్ము విష్ణుండంతలఁపన్ ॥ 17

చ॥ మనువులు దేవతల్ ఋషులుమానవనాయకులింద్రులిమ్మహిన్
వనజదళాక్షునంశములు, వాక్కులనేల బనియేమిపద్మజో ।
చనుఁజగంబులన్నియును సయును గనేలయన్ననో
మునివర భావిమన్వధిపముఖ్యులఁ జెప్పెదమన్ననిట్లనున్ ॥ 18

ఉ॥ త్వష్టతనూజ సంజ్ఞయనఁదామరసాప్తునిదేవి, సాధ్వీతో
తిక్ఛప్తచరిత్ర, నల్లభునికిన్ ప్తికి నోర్వక, యాత్మయోగవి ।
స్పష్టవిభూతిఛాయయను భామనొకర్తు సృజించిభర్తకున్
శిష్టతసేవచేయుమనిచెప్పి తపంబొనరింపఁబోయినన్ ॥ 19

ఉ॥ ఛాయయుమాయయేర్పడక నారసబంధుని సేవయెప్పుడున్
బాయకసేయుచుండె, భయభక్తినయంబు లెలర్పనంత భ ।
వ్యాయతితోనపత్యముల, నర్హవిధంబునఁగాంచ దివ్యతే
జోయుతమూర్తులం బెనుచుచుం బరిపాటి వసించియున్నెడన్ ॥ 20

॥ ఇట్లు శనైశ్చరుండును, మనువును, తపతియునను నపత్యత్రయంబుఁగాంచి ॥

॥ మనువును, యముండును, యమునయు
ననుముగ్వురఁగాంచిచనియె, నా సంజ్ఞయు, ము ।

వ॥ ఇంద్ర, దేవ, సప్తర్షి, మను, మనుపుత్రులు మన్వంతరాధికారులుగా నెఱుంగుము. ఇట్లు చతుర్దశమన్వంతరంబులు సహస్రయుగపర్యంతంబగు నొక్క దివసంబగు. అదియొక్క కల్పంబనంబరగు. రాత్రియుం దావత్ప్రమాణమై నట్లిట్లు. 37

చ॥ కమలజుండై, రమాపతి జగంబులుమూడు నుమిసంగి, శేష త
ల్పమున లయాంబురాశిసలిలంబులపైం బవళించి, తన్నిశాం।
తిమునం బ్రబుద్ధుండై సుజనతత్పరతం భువనాళిం దొంటి చా
డ్పమున సృజించు, రాజసగుణప్రచురీభవదాత్మతంత్రుండై 38

క॥ మనువులు ఋషులింద్రుండును. మనుపుత్రులు నవిజులును రమావిభునంశం।
బనుపమసత్వోద్రిక్తం, బనియెఱుంగుము నీమనంబున నాశ్రితప్రణుతా॥ 39

వ॥ చతుర్యుగంబుల నా విష్ణుదేవుండు స్థితి వ్యాపారకలనుండై యుగవ్యవస్థలు నడుపు. కృతయుగంబునం గపిలాది రూపధారియై సర్వభూతహితరతుండై, విమలజ్ఞానదానంబు సేయు. త్రేతాయుగంబున జక్రవర్తి స్వరూపంబున జగత్పాలనంబు సేయు. భూత, భవిష్యద్వర్తమాన కాలంబుల జగంబులు రక్షించు. మైత్రేయ! మన్వంతరంబులు చెప్పితి నింక నేమి చెప్పవలయునన్న గురువునకు శిష్యుం డిట్లనియె॥ 40

క॥ వేదవ్యాసమునీంద్రుండు. వేదద్రుమమేవిధమున విభజించెం దానిం
యాద్యుతశాఖలనెన్ని, యుగంబులయందెన్ని మారులుదయించె మహీశ॥ 41

క॥ హరిపుట్టించు జగంబులు, హరియందును నిలుచుం బొలియుహరివలన నెయా।
హరికన్న సృష్టి కర్తుండు, హరిణనయనులకు లేదు కాదనరాంతరమునయన్॥ 42

వ॥ అనియడిగిన శ్రీపరాశరుం డిట్లనియె॥ 43

క॥ వేదతరువునకు, శాఖా, భేదములు సహస్రముల వి పేర్కొని చెప్పన్।
గాదని మైనం జెప్పెద. నాకృతి సంక్షేపమున మహాత్మా తెలియన్॥ 44

గీ॥ తామరసలోచనుండు, ప్రతిద్వాపరమున, నతులితప్రభ, వ్యాసుండై, యవత
యేకమగు వేదరాశి ననేకభంగి, వెలయంజేయు జగద్ధితకలనం గూర్చి॥ [రించి,

క॥ బలవీర్య బుద్ధి తేజము, లలనడి నల్పములు మానవాదులకనియా।
య్యాలఘువులు వేదభేదము, తెలమినొనర్చుం, దనీయహితమతియగుచున్॥ 46

వ॥ వేదంబులు విభజించి, విస్తరించుటం జేసి వేదవ్యాసుండన వాసుదేవుండు వెలయు. వినుము. ఈ వైవస్వతమన్వంతరంబున నిరువదితొమ్మిదిమార్లు వేదంబు

మహర్షులచేత వ్యస్తంబయ్యె. ఈ వైవస్వతమన్వంతరంబున ద్వాపరయుగంబుల నిరువదియెనమండ్రు వ్యాసులుచనిరి. ప్రథమంబుద్వాపరంబున స్వాయంభువుండు తానవేదంబువ్యస్తంబుచేసె. ద్వితీయద్వాపరంబునఁ బ్రజాపతి వ్యాసుండయ్యె. తృతీయద్వాపరంబున శుక్రుండు, చతుర్థద్వాపరంబున బృహస్పతి, పంచమద్వాపరంబున సవిత, షష్ఠద్వాపరంబునఁ బ్రభువైన మృత్యువు సప్తమద్వాపరంబున నింద్రుండు, అష్టమద్వాపరంబున వసిష్ఠుండు, నవమద్వాపరంబున సారస్వతుండు, దశమద్వాపరంబున శ్రీధాముండు, ఏకాదశంబునఁ ద్రిస్పృష, ద్వాదశంబున భరద్వాజుండు, త్రయోదశంబున నంతకుండు, చతుర్దశంబున ధర్ముండు, పంచదశంబునఁ ద్రయ్యారుణుండు, షోడశంబున ధనంజయుండు, సప్తదశంబునఁ గృతంజయుండు, అష్టాదశంబున ఋణంజయుండు, తదనంతరంబు భరద్వాజుండు, తదనంతరంబ గౌతముండు, తదనంతరంబ హర్యాత్మ, తదనంతరంబ వేనుఁడు, తదనంతరంబ వాజశ్రవుండు, తదనంతరంబ సోముండు, తదనంతరంబ శుష్మాయణుండు, తదనంతరంబ తృణబిందుండు, తదనంతరంబ ఋక్షుండు, తదనంతరంబ వాల్మీకి, అవ్వల,నస్మజ్జనకుండైన శక్తి, తదనంతరంబ నేను, నాతరువాత జాతికర్ణుండు, అవ్వల కృష్ణద్వైపాయనుండు. ఈ యిరువదియెనమండ్రును నతీతవ్యాసులు. వీరిచేత వేదంబు నాలుగు విధంబుల ద్వాపరాదులయందు విభజింపంబడియె వినుము॥ 47

॥ భావిద్వాపరమున, సం, భావితుఁడగు ద్రోణసుతుఁడు భావివ్యాసుం।
డై, వేదచయము విస్మృతి, మై, వెలయింపఁ గనుభూసురాన్వయతిలకా ॥ 48

॥ ప్రణవాఖ్యమేకాక్షరము బృహత్త్వముఁబృంహ, ణత్వమ్ముగలకతన మ్మునీంద్ర,
బ్రహ్మంబుసుమ్మందు బరఁగు భూర్భువరాది, సప్తలోకంబులు సకలవేద।
తతియుసర్వంబును దాదృక్ప్రభాసం,భావిత, మది వాసుదేవరూప,
మక్షయ్యమధికగుహ్యము జగదుత్పత్తి,రక్షణనాశకారణముయోగి ॥

॥ సాంఖ్యనిష్ఠాపరులకు శాశ్వతపుసుగతి, యామృతమాద్యంతరహిత మనంతమజర।
మట్టిహరిరూపక ప్రణవాభిధాన, మానిత బ్రహ్మమునకు నమస్కరింతు ॥ 49

॥ ఆ ప్రణవంబు నందునున్న ఋగ్యజుస్సామాథర్వణవేదంబులు సర్వాత్మకుండగు పుండరీకాక్షుండు తాన వేదంబులు శాఖలునై విభజింపంబడియె ॥ 50

॥ ఆదిని,వేదంబుచతు, ష్పాదంబై శతసహస్ర పరిమితమై లో।
కాదృతమై వెలుగొందును, భోదయతన్ సకలసన్నుతోన్నతచరితా ॥ 51

॥ తదనంతరంబ సర్వకామధుక్కైన యజ్ఞంబయ్యె. అంతమత్పుత్రుండైనవ్యాసుండిరువైయెనిమిదవ ద్వాపరంబునఁ జతుష్పాదంబగువేదంబు ఋగ్యజుస్సామా

ధర్వణరూపంబుల నాలుగు తెఱంగులుగా విభజించె. ఆకృష్ణద్వైపాయనుండు సాక్షాన్నారాయణుండుగా నెఱుంగుము. అతండు దక్కనన్యులసు నపార భారతసాగరంబు నిస్తరింప శక్యంబే. ఆవ్యాసుండు బ్రహ్మచేత నియుక్తుండై వేదంబు నాల్గుతెఱంగుల విభజించి శిష్యులంజదివించె. తత్ప్రకారంబు వినుము ॥ 52

సీ॥ శమదమప్రతిభావిశాలుండుపైలుండు, కృతమతిఁజేసి ఋగ్వేదపఠన ।
సద్గుణాయనుఁడు వైశంపాయనుఁడు,శుభా,యతి,యజురామ్నాయమధిగమించె।
వినుతనిష్కామిజైమిని మునిస్వామిసం, భావనానియతి సామసుపఠించె ।
మహనీయతరమహామతిమంతుఁడు సుమంతుఁ, డధిక ప్రభ,నథర్వమధిగమించె॥

గీ॥ రోమహర్షణతనయుండురుచిరవినయుఁ, డతులితఖ్యాతుఁడౌసూతుఁడలపురాణ ।
సహితసకలేతిహాసముల్ చాలఁజదివె, నతఁడువ్యాసకరుణా కటాక్షమహిమ ॥

వ॥ వేదంబులయందు యజుస్సులచేత యజుర్వేదంబును, ఋక్కులచేత ఋగ్వేదంబును సామంబులచేత సామవేదంబును, నథర్వంబులచేత నథర్వవేదంబును నయ్యె. అయ్యథర్వంబు రాజులకు సర్వకర్మ సాధనంబయ్యె. ఇట్లు వేదవ్యాసుండు వేదకాననంబును జతుర్విధంబుగా విభజించె. అందు పైలుండు ప్రథమంబు ఋగ్వేదంబు నింద్ర ప్రమతికినిచ్చె నయింద్రప్రమతి భాష్కలునకిచ్చె. ఆభాష్కలుండు బోధ్యాదులైన శిష్యులకిచ్చె. ఆబోధ్యాదులవలన యాజ్ఞవల్క్య పరాశరులు గ్రహించిరి. ఇట్లుశాఖోపశాఖల ఋగ్వేద ము వెలసె. ఆయింద్రప్రమతి నిజపుత్రుండైన మాండూకేయునిం జదివించె. అతనిశిష్య ప్రశిష్యులవలన విస్తరిల్లె. అతనిపుత్రుండు వేదమిత్రుండను ముద్గల, గోముఖ, వాత్స్య,శాలీయ, కౌశికులను శిష్యపంచకంబునకు సంహితా పంచకంబుఁజెప్పె. ఇవ్విధంబున ఋక్కులు బహువిధంబులై కీర్తితంబులయ్యె ॥ 54

క॥ మునివర వైశంపాయన, మునివరుఁడు యజుర్నిగమము మునుపిరువదియే ।
డనుపమశాఖలుగావించి, నయంబొప్పఁగనొసంగెశిష్యుల కెల్లన్ ॥ 55

సీ॥ మునివరులెల్లి సమూహమైమేరుభూ, ధరకూటముననుండి తమరుచేసి ।
లోకమర్యాద శిష్యులఁగూడియే, ఋషియైన నాచ్ఛోటకునరిగ నేని ।
యతనికిస ప్తరాత్రాం తరంబున,బ్రహ్మ, హత్యవాటిలునని యానయొఱింగి ।
మునులెవ్వరచ్ఛోటికిని బోనరంతవై, శంపాయనుఁడు శిష్యసమితితోడ ॥

గీ॥ నచ్ఛటికిఁబోయియచటశాత్మఁడగుచునవుడు, స్వప్రియునినొక్క బాలకుచరణతాడ।
నాభినిహతునిఁజేసిననాతఁడంత, భవ్యునకునాయనకు నచ్చెబ్రహ్మహత్య ॥ 56

క॥ మునిపతివై శంపాయనుఁ, డనునయమున శిష్యవరులనను, "సద్వ్రతమీ ।
రొనరింప వలయునాకున్, బనుపడనీ బ్రహ్మహత్య పాసెడుకొఱకున్" ॥ 57

వ॥ అని గురుండు చెప్పిన ॥ 58

క॥ నిరుపమమేధానిధిభా, స్కరతేజుఁడు వారిలోనచతురుఁడు ప్రజ్ఞా ।
చరణుండు యాజ్ఞవల్క్యుఁడు, గురునకునిట్లనియె మెండుకొను సద్భక్తిన్ ॥ 59

గీ॥ అల్పతేజులతి క్లిష్టులైనవీరి, చేతనేమగు చేసినచేయఁదగుదు ।
నేనయనిపూనిపల్క నమ్మౌనివరుఁడు, పల్కెఁగోపారుణాననపద్ముఁడగుచు ॥ 60

క॥ ద్విజవరుల, ధిక్కరించుటఁ, బ్రజనితమైయిపుడు ఘోరపాపమునిన్నున్ ।
భజియించెఁదొలఁగి పొమ్మ,క్కజముగ మాచదువు మగుడ గానిచ్చియనన్ ॥ 61

చ॥ గురుఁడనినీకు నే హితముగూర్చి యొనర్చెదనన్న నిట్టిని
ష్ఠురతరభాషలాడెదవు చొప్పడునే భవదీయవేదవా
గ్భరణముదీనిఁగొమ్మనుచుఁ గ్రక్కనఁ గ్రక్కనరక్తసిక్తభీ
కరయజురాగమంబుఁగొనెఁ గ్రమ్మరనామునిసార్వభౌముఁడున్ ॥ 62

వ॥ ఇట్లు గురునిముందరం గ్రక్కినయజుస్సులు తిత్తిరిరూపంబున శిష్యులు గ్రహించి వారలు తైత్తిరీయులనంబరఁగిరి, గురుప్రేరితులై యాధ్వర్యులు బ్రహ్మహత్యా వ్రతంబుచరించి రంతయాజ్ఞవల్క్యుఁడు స్వేచ్ఛంజని యజుస్సులభిలషించి ప్రాణాయామపరాయణుండై, యాదిత్యునుద్దేశించి యిట్లని స్తుతియించె ॥ 63

సీ॥ సకలవేదాత్మమోక్షద్వారభూతనీ, వ్యక్తతేజనీకివేవందనములు ।
సోమాగ్నిభూతిపోషమ్ము తేజోధారి, భాస్కరనీకివే ప్రణతిశతులు ।
కాలస్వరూపయక్షరరూపవిష్ణుస్వ, రూపకనీకివేమ్రొక్కుగములు ।
సురపితృరక్షణోత్సుకహిమ ఘర్మాంబు, కారి,నీకివె నమస్కారచయము ॥

గీ॥ అంధకారాపహరణ, లోకాధినాథ, సర్వకామధురీణ, విశ్వప్రపంచ ।
కారణ,పవిత్రకిరణౌఘధారి,యభ్ర, మణియొనర్చెదని వెప్రణామములునీకు ॥ 64

క॥ నీవుదయింపక, సత్క,ర్మావళికి జనుండయోగ్యుఁ డఖిలాంబువులుం ।
గావుపవిత్రములట్టి శు,భావహునకు నీకొనర్తు నభివందనముల్ ॥ 65

క॥ నీకిరణంబులుసోఁకిన, లోకంబుపవిత్ర మగునులోకనయన, పు ।
ణ్యాకరుఁడా తండెవ్వఁడు, నీకమనీయాంఘ్రి భక్తినిరతుఁడు తలఁపన్ ॥ 66

గీ॥ అమృతమయవాజు లేదేవు హైమరథముఁ, దాల్చి దుర్గమగగన పథప్రచార ।
చారు వైఖరిఁ దిరుగు నా సకలలోక, లోచనునినిన్నుఁ గొలుతునుశ్లోకచరిత॥ 67

వ॥ సవిత, సూర్యుండు, భాస్కరుండు, వివస్వంతుండు, ఆదిత్యుండు, దేవాద్యాది భూతుండును నైన నీకు నమస్కారంబు ॥ 68

లయగ్రాహి

సూర్య తిమిరోన్నమదహార్యభిదురీభవద వార్యచటులోగ్రతరధుర్యవిలసద్భా ।
గార్యభుజగాధిప తిధార్యనుత సంచయవిదార్య సమరూప బలధైర్యనుత సంజ్ఞా ।
భార్యనిజకృత్య సురకార్య నిగమాంతనుతిచార్య జగదర్చన కదర్యగుణరక్షా ।
పర్యహరణప్రవణశౌర్యనికలీన సుఖదచర్య సతతప్రణమధార్యనినుఁ గొల్తున్ ॥ 69

చ॥ అనియనియంతభక్తి నిగమార్థములన్నినుతించు యాజ్ఞ వ
ల్క్యునకుఁ బ్రసన్నుఁడై పలికె సుగ్రమయూఖుఁడు వాజిరూపుఁడై ।
మునివర యేమిగోరితి వమోఘముగా నొసగూర్తు నీవుగో
రినపనియన్న నన్న మునిశ్రేష్ఠుఁడు చేతులుమోడ్చి యిట్లనున్ ॥ 70

సీ॥ నళినాప్త మద్గురునకు లేనియాజుష, సంహిత మీకటాక్షమున నాకుఁ ।
గావలెననిన నానిపటువాజిరూపధరుఁడు యజుస్తోంలు విప్రునకునొసఁగె ।
ఆ మ్మునీశ్వరుఁడు శిష్యవరులఁ జదివించె, వాజిసూక్తప్రసన్నవశతవారు ।
వాజిసులనఁగ భూతలయమునఁ బ్రసిద్ధులైరి కణ్వాదుల య్యాగమంబు ॥

గీ॥ కాలదిమాపి బదేను శాఖలుగఁ జేసి, ఘనఘులగు యాజ్ఞవల్క్యశిష్యవరులుర్వి ।
ం జేసిరి మిథిల సన్నిగమమహిమ, మానితాచార మైత్రేయమహానివర్య॥71

గీ॥ జైమినిముని భేదించెన్, సామనిగమతరువుఁ బెక్కుశాఖలుగఁ దడీ ।
యామితమహామమువిను,చే, తోమాదిమునిఁడుఁ గ్రమముతోమునినాథా॥ 72

వ॥ జైమినిమునీంద్రుఁడు సుమంతునిఁ, సత్పుత్రుని సుపార్శ్వుని, నౌకౌకక్ల సంహితఁ జదివించె. తత్పుత్రుఁడు సుకర్ముండు సహస్రసంహితాభేదంబుచేసె ఆసుకర్ముని శిష్యులు హిరణ్యనాభ, కౌసల్య, పౌష్యింజప్రముఖులైన యునీచ్యు లాసహస్ర సంహితలు గ్రహించి సామగాతలైరి. హిరణ్యనాభునివలనఁదచ్ఛి ష్యులు లోకాక్షి, కౌథుమి, సన్గంధి, లాంగలి, దాప్పందిప్రముఖులు సంహి తలు గ్రహించిరి. వారిశిష్య ప్రశిష్యులవలన బహుసంహితలు ప్రవర్తించె॥

గీ॥ ధర్మనిరత యథర్వవేదమునుసుమంతుఁ, డాత్మశిష్యుఁ గబంధునినధిగమింపఁ ।
జేసె నాతండు చదివించె శిష్యదేవ, దర్శు, నాతఁడు పథ్యునకుఁదగఁగఁ జెప్పె॥

వ॥ దేవదర్శశిష్యులు మేధ, బలి, బ్రహ్మ, శాల్కాయని, పిప్పలాద ప్రముఖులు చదివిరి. పథ్యశిష్యులుజాజలికుముదాది శౌనకులు ముగ్గురును సంహితలు చదివిరి. శౌనకుండు రెండు సంహితలుచేసె. ఒక్క సంహితబభ్రునకును, రెండవ సంహిత సైంధవునకునిచ్చె. సైంధవుండు రెండుగా భేదించి ముంజకేశసత్పుత్రుల కిచ్చె. మఱియు నాంగిరసప్రముఖు లనేక శాఖలుచేసిరి. ఇది యథర్వప్రకారంబు॥

గీ॥ అంచితాఖ్యానములునుపాఖ్యానములను, గాథలవిశాలతాఖ్యాతి గలపురాణ।
సంహితలుచేసినోమహర్షి సూతునకును. సూతునకుం జెప్పె వ్యాసుండస్తోకమహిమ॥

వ॥ సుమంతుండును, అగ్నివర్చసుండును, మిత్రాయువు, శాంశపాయనుండు, అకృతవ్రణుండు, సావర్ణియనెడు నార్వురు సూతునిశిష్యులు పురాణంబులు, సంహితలుచదివిరి. కాశ్యపి, శాంశపాయని, మహర్షియును సంహితాత్రయంబు చదివిరి. బ్రాహ్మంబు, పాద్మంబు, వైష్ణవంబు, శైవంబు, భాగవతంబు, నారదీయంబు, మార్కండేయంబు, ఆగ్నేయంబు, భవిష్యత్పురాణంబు, బ్రహ్మకైవర్తనంబు, లైంగంబు, వారాహంబు, స్కాందంబు, వామనంబు, కౌర్మంబు మాత్స్యంబు, గారుడంబు, బ్రహ్మాండంబు, ననునష్టాదశపురాణంబులు సర్గ, ప్రతిసర్గ, వంశ, మన్వంతర, వంశానుచరితంబులు గలుగుచుండు. మైత్రేయా! ఇప్పుడు నీకుఁజెప్పు నిప్పురాణంబు వైష్ణవంబను మూఁడవ పురాణంబు. ఇందు సర్గ, ప్రతిసర్గ, వంశ, మన్వంతర, వంశానుచరితంబులందును, సమస్త వస్తువులయందును, భగవంతుండైన విష్ణుండె ప్రతిపాదింపఁబడుఁ, షడంగంబులు, నాల్గువేదంబులు, మీమాంసయు, న్యాయవిస్తరంబును, పురాణంబును, ధర్మశాస్త్రంబును ననఁ చతుర్దశవిద్యలు. ఆయుర్వేదంబును, ధనుర్వేదంబును, గాంధర్వంబును, నర్థశాస్త్రంబును గూడ నష్టాదశవిద్యలు చెప్పఁబడె. బ్రహ్మర్షులు, దేవర్షులు, రాజర్షులనఁ ఋషిప్రభృతులు మూఁడుతెఱంగులు. ఇవ్విధంబున శాఖలు, శాఖాభేదంబులు, శాఖాకర్తలు, తద్దేతువులుం జెప్పితి. సర్వమన్వంతరంబులయందును, శాఖాభేదంబులు సమంబ ప్రాజాపత్యశ్రుతి నిత్యంబ. ఇతరంబులు వికల్పంబులు. ఇంక నేమియడిగెదనిన మైత్రేయుం డిట్లనియె. 77

క॥ మునివర నేనడిగినవెల్లను నానతిచ్చితిరి సలక్షణముగ నిం।
క నొకటి యడిగెదనిన్నుం, బసివశ యాదయానతిమ్ము ప్రస్ఫుట భంగిన్॥ 78

సీ॥ సర్వజ్ఞ యీసారసభవాండ మధ్యస్థి, తాశేషలోకంబులందు, స్థూల,
సూక్ష్మరూపములగు చున్నిండిస్థావర, జంగమంబులు ప్రాణిసముదయములు।

వ॥ పాశుపాల్యంబును, వాణిజ్యంబును, కృషియును, వైశ్యునకు జీవికగాఁ బితామహుండు నిర్మించియిచ్చె. అతనికి నధ్యయన యజ్ఞ దానంబులు ప్రశస్తంబులు. నిత్యనైమిత్తికకర్మానుష్ఠానంబును విహితంబు. శూద్రునకు ద్విజాతిశుశ్రూషంబును, ద్విజాతిపోషణంబును, క్రయవిక్రయార్జితద్రవ్యంబునైనను, నితరకర్మోద్భవద్రవ్యంబునైనను, దానంబును, పాయక, యజ్ఞంబులచేత యజించుటయును, పితృకార్యాదికర్మాచరణంబును, నాచరింపవలయు. భృత్యాదిభరణార్థంబునకుఁ బరిగ్రహంబునుం జేయవలయు, సగరభూపాల! స్వభార్యయందు ఋతుకాలాభిగమనంబును, సమస్తభూతదయయును, తితిక్షయు, నాతిమానితయు, సత్యశౌచంబులు, అనాయాసంబు, మంగళంబు, ప్రియవాదిత్వంబు, మిత్రత్వంబు, నిస్పృహ, అకార్పణ్యంబు, అనసూయయు. నిఖిలవర్ణంబులకు సమానగుణంబులు, ఇంక నాపద్ధర్మంబులు వినుము॥ 124

గీ॥ బ్రాహ్మణుఁడు క్షత్రియునివృత్తి, రాజు వైశ్యవృత్తి, వైశ్యుఁడు శూద్రునివృత్తి నడువవలయు నాపదన్మైన శూద్రులనడకలు, బ్రాహ్మణక్షత్రియులకు నసహ్యములు గావు॥

వ॥ బ్రాహ్మణక్షత్రియులును; సామర్థ్యంబుగలిగిన శూద్రవృత్తి మానవలయు. అత్యంతాపదయైన శూద్రవృత్తియైన నవలంబింపవలయునియుం గలదు. [illegible]నంబు చేయవలదని యౌర్వుండాశ్రమ ధర్మంబులు వినుమని సగరున కిట్లనియె॥ 126

సీ॥ బాలత్వమునఁ గృతోపనయనుఁడై విప్రుండు, చదువఁబూనినవాఁడై [illegible]
యై బ్రహ్మచర్యసమాహితత్వమున శౌచాచారసంయుతుఁడై సుధీబుద్ధి
గురునకు శుశ్రూషఁ గూర్చి చేయుచునును, వ్రతనిష్ఠ వేదమున్నతిఁ, జదువుచు।
నుభయసంధ్యలను సూర్యునిఁ నగ్నిఁ గొలుచుచు, గురునాజ్ఞ భైక్షంబు గుడిచి నిలిచి॥

గీ॥ జలసమిన్ముఖ్యములు గురువులకు భక్తిఁ, దెచ్చి యిచ్చుచు వేదంబు పృథుమనీష।
నభ్యసింపంగవలయు రాజాగ్రగణ్య, బ్రహ్మచారి సముజ్జ్వల ప్రతిభ మెఱసి॥ 127

వ॥ ఇట్లు బ్రహ్మచర్యంబు నడిపి గార్హస్థ్యంబునకు ననుజ్ఞాతుండై గురునకు దక్షిణ యొసంగి॥ 128

ఉ॥ ధర్మమునన్ యథోక్తగతి దారపరిగ్రహమాచరించి సు,
త్కర్మమునన్ ధనార్జనముదారతఁ జేసి గృహస్థకృత్యముల్।
నిర్మలవృత్తియై నడిపి నిచ్చలు యజ్ఞములైదు చేయుచున్,
పేర్మియెలర్ప సద్గతిలభించు గృహస్థుఁడు లోకపూజ్యుఁడై॥ 129

వ॥ నివాపంబునఁ బితరులను, యజ్ఞంబున దేవతలను, నన్నంబున నతిథులను, స్వాధ్యాయంబున ఋషులను, సంతానంబునం బ్రజాపతిని బలికర్మంబుల భూతంబులను, వాత్సల్యంబున జనంబులను, దుష్టింబొందించి గృహస్థుండు నిజకర్మసమార్జితంబులగు నుత్తమ లోకంబులం బొందు॥ 130

క॥ భైక్షము జీవిక గాఁగల, భిక్షుకులును బ్రహ్మచారిబృందమ్మును స।
ర్వక్షేమంకరకృత్యావి, చక్షణు గృహమేధిఁ జేరి సత్రాణించున్॥ 131

ఉ॥ వేదము లభ్యసించుటకు వేమఱుతీర్థము లాడఁబుణ్యశై,
లాదులుచూడ నెప్పుడు నరామరవర్గము సంచరించు న॥
త్యాదృతిఁ బ్రాపుకూఁకులు గృహంబులు నీరములన్నములన్నహో,
వేమలుతల్పముల్ పఱిచె విత్తముగా మదిలోన నెంచుచున్॥ 132

వ॥ ఇట్టి యతిథులకు గృహస్థుం డాస్పదంబు. అయ్యతిథుల స్వాగతంబుమధురోక్తులనడిగి గృహస్థుండు శయనాసనభోజనంబు లొసంగవలయు॥ 133

గీ॥ అతిథి యెవ్వని యింటికి నరిగి తిరిగి, పోవుఁ దనపాతకము లెల్లఁ బూన్చువాని।
సుకృత మెల్లను గొనిపోవుఁ జువ్వెగాన, నతిథి నూరకఁ బొమ్మన ననుచితంబు॥

వ॥ అవజ్ఞయు, దంభంబును, బరితాపోపఘాతంబులును, బారుష్యంబును నతిథుల యెడం జేయరాదు. ఏగృహస్థుండైనను నాతిథ్యంబును సమ్యగ్విధిం జేయు నాతండు సమస్త పుణ్యలోకంబులనొందు॥ 135

క॥ తనకువయఃపరిణతిగాఁ, దనయులకడ నిలువనైన సతి యనుగతినై।
నను, రా సతినియ్యఁగొలిపి, వనమునకుం బోయి యచటవన్యాశనుఁడై॥ 136

వ॥ వనంబుననిల్చి, కేశశ్మశ్రు జటాధరుండును, భూమిశాయియు, మననశీలుండును, సర్వార్థనిస్పృహుండును, చర్మ, కుశ, కాశ, కృతపరిధానోత్తరీయుండును, త్రిషవణస్నానపరుండును, నగ్నిదేవతాభ్యాగతపూజాతత్పరుండును, భిక్షాబలిప్రదాతయు, నభ్యస్నేహాకృతిగాత్రాభ్యంగకార్యుండును, శీతోష్ణాది సహిష్ణువునై వానప్రస్థచర్యనడపి యతండు, దవానలంబు తూలరాశులంబోలె సర్వదోషంబుల దహించి శాశ్వత పుణ్యలోకంబుఁగాంచు॥ 137

క॥ నాలుగవయాశ్రమము భూ, పాలక యెఱిఁగింతు వినుము బ్రాహ్మణుఁడు, విని।
ర్మూలితమదమత్సరుఁడై, వాలాయము భిక్షువృత్తి వర్తింపఁ దగున్॥ 138

వ॥ పుత్రమిత్రకళత్రాదులపై స్నేహంబువిడిచి త్రైవర్గికంబులగు సర్వారంభంబులు విడిచి శత్రుమిత్రాదులయందు సమతగలిగి సర్వజంతులయందు ద్రోహంబు మాని మైత్రుండై సంగంబువదలి యేకరాత్రంబుగ్రామంబునఁ బంచరాత్రంబు

పురంబున నిలుచుచుఁ బ్రీతి ద్వేషంబులు లేక యింటివారు భుజియించి పోయి చల్లార్చినకాలంబునఁ బ్రశస్తవర్ణుల యిండ్ల భిక్షాటనంబుచేసి ప్రాణంబులు నిలుపుచుఁ గామ, క్రోధ, దర్ప, మోహ, లోభాది దోషంబులు పరిత్యజించి నిర్మలుండై తనవలన సర్వభూతంబులు, భూతంబులవలనఁ దాను, భయంబు వొరయకుండునట్లుగా మెలంగుచు, నగ్నిహోత్రంబు శరీరంబున, శరీరాగ్నిహోత్రంబులు ముఖంబునను వేల్చి భిక్షుండు మోక్షాశ్రమంబాశ్రయించి నిరింధనజ్యోతియుం బోలె శాంతుండై బ్రహ్మలోకంబు నొందునని చెప్పిన॥ 139

క॥ ఔర్వునినతులప్రతిభా, శర్వునినీక్షించిపలికె సగరుఁడుకరుణా ।
ధూర్వహకటాక్ష! యశ్రుత, పూర్వంబొకటడుగవలయుఁబో!మిముఁదెలియన్॥

ఉ॥ హత్తియొనర్చు పూరుషునకారయఁ గృత్యములైననిత్యనై
మిత్తికకామ్యకర్మములు మెచ్చుగనే గతియాచరించువా
రిత్తఱిఁజెప్పుమయ్య, మదిహెచ్చె భవద్వచనావళుల్వినన్
జిత్తమునం, గుతూహలవిజృంభము భార్గవవంశవర్ధనా॥ 141

వ॥ అనిననౌర్వుం డిట్లనియె. పుత్త్రుండుపుట్టిన నభ్యుదయాత్మకంబైన శ్రాద్ధంబు సేయవలయు. బ్రాహ్మణభోజనంబు వెట్టి నాందీముఖులకుఁ బిండప్రదానంబుచేసి దశమదివసంబున నామకరణంబు చేయవలయు॥ 142

గీ॥ వలయుభంగినుత్సవము, చెల్లఁగా, దేవ, నామమైన మనుజనామమైన ।
శుభముహూర్తమున విశుద్ధుఁడై జనకుండు, సుతునకిడఁగ వలయునతులమహిమ॥

వ॥ బ్రాహ్మణ, క్షత్త్రియ, వైశ్య, శూద్రులకుఁ గ్రమంబున శర్మ, వర్మ, గుప్త, దాసాత్మకంబైన నామంబిడవలయు. అర్థహీనంబును, నప్రశస్తంబును, నపశబ్దయుతంబును, నమాంగళ్యంబును, జుగుప్సితంబును నగునామంబిడవలదు. సమాక్షరంబును, నాతిహ్రస్వంబును, నాతిగుర్వక్షరాన్వితంబును, సుఖోచ్చార్యంబునగు నామంబిడవలయు॥ 144

సీ॥ సరవిననంతరసంస్కారసంస్కృతుఁ, డై గురుగేహంబు నందువిహిత ।
విధినవలంబించి విద్యాపరిగ్రహ, ణముచేసిగురు దక్షిణాప్రదాన ।
కారియైగార్హస్థ్యకలన కనుజ్ఞాతుఁ, డైనను మేలుకాదేనిబ్రహ్మ ।
చర్యంబుననయుండు సన్న్యాసియైనను, వైఖానసుండైన వలసినట్టిఁ॥ [వేద ।
తే॥ డై ముముక్షుత్వమునసత్క్రియాకలాప, మాచరింపఁగవలయు బ్రాహ్మణుఁడు
విహితవిధియిది దీనిభావించివినుము, మహితగుణసాంద్ర! సగరభూమండలేంద్ర॥

వ॥ గార్హస్థ్యంబు గావలసిన నేకగుణవర్గమైనకన్యకను, దానుద్రిగుణవర్గుండై పరి గ్రహింపవలయు ॥ 146

సీ॥ అతికేశియు,సకేశి, యధికాంగి, కృష్టాంగి, పింగళన్యూనాంగి,యంగహీన।
రోగిణి, కులట, యరూపిణి, దుష్టవా, త్సల్యసరోమయు, శ్మశ్రువదన।
కాకస్వర, కృశాంగి, ఘర్ఘరస్వర, పురు, షాకృతిబుద్ధాక్షి యరుణదృష్టి।
పీనాంగి,వామన, పృథుదీర్ఘసంహతి, భ్రూయుగ రూక్షాంగిక్రుద్ధవదన॥

గీ॥ చిత్రదంత,మషీవర్ణ, శ్వేతవర్ణ, కూపగండ, సమున్నతగుల్భ రోమ।
సహితజంఘు, వినిందితాచారయైన, కన్యఁబెండిలియాడఁగఁ గాదుబుధులు॥ 147

వ॥ మాతృపక్షంబునఁ, బంచమియుఁ, బితృపక్షంబున సప్తమియునైన కన్యకను యథావిధివివాహంబు గావలయును. బ్రాహ్మ్యంబు, దైవంబు,నార్షంబు,ప్రాజాపత్యంబు, నాసురంబు, గాంధర్వంబు, రాక్షసంబు, పైశాచంబు నననెనిమిది వివాహంబులు. అందేవర్ణంబున కేవివాహంబువిహితం బావివాహంబావర్ణంబువారుచేయవలయు. ఇవ్విధంబున సలక్షణయైన ధర్మచారిణిం బరిగ్రహించి తత్సహితుండై గృహస్థుండు, విహితకృత్యంబులు నడిపిసమ్యగూర్ధ్వ మహాఫలంబు నొందునని చెప్పి సగరుండిట్లనియె ॥ 148

గీ॥ మానినాథ!సదాచార మానవిస్ఫు, కరుణతోనాకు శ్రవణేచ్ఛగడలుకొనియెఁ।
దాననడిచిగృహస్థుండు మానసీయ, దివ్యలోకసుఖాప్తి మోదించుఁగాదె॥ 149

వ॥ అనిన నౌర్వుండిట్లనియె ॥ 150

మ॥ జననాథోత్తమ చెప్పెద న్వినుము, సదాచారంబు, నిత్యంబున
జ్జనులత్యాదృతి, నాచరించుట, సదాచారంబనంజెల్లు, స।
జ్జనసంజ్ఞల్ మనువుల్ ప్రజాపతులు నాన స్తప్తసంయుల్వెరతా
ద్వినుతాచారపరాయణుండు గను దేవిర్ రెండు లోకంబులున్ ॥ 151

గీ॥ రాజ!వినుధర్మపీడాకరంబులైన, యర్థమునుగామమును మానుటర్హమగును।
అసుఖమై లోకవిద్విష్టమయ్యెనేని, ధర్మమునుమానవలయుభూధరవరేణ్య॥ 152

వ॥ కాల్యంబునలేచి తననివాసంబునకు నైరృతిభాగంబున నంపకోలవాటినంత దూరముపోయి యచ్చట మూత్రపురీషంబుల విడువవలయు ॥ 153

క॥ తననీడఁ దరువుసీడన్, విను గోరవివహ్నివాతవిప్రగురువులం।
గనుచునెదుటఁగనువిడువం,జనదు,నులసు మూత్రమును,ప్రశస్తునకెపుడున్॥154

గీ॥ పైరులోదుక్కిలో మందపట్టునందు, తెరువులోనీటిలో నదీతీర్థములను।
మసనమున నేటిదరియందుమాసవుండు, మలముమూత్రంబువిడువరాదలఘుచరిత ॥

వ॥ మంత్రాభిమంత్రితంబులను, ఫలమూలంబులును, శుష్కశాకంబులును, హరితకంబులును, గుడభక్ష్యంబులును, దక్షిణ దక్షిణ పర్యుషితంబులు మాని సారంబులుపీసిన వస్తువులుమాని భుజియింపవలయు. మధు, జల, దధి, ఘృత, సక్తువులు దక్షిణదక్షిణ వస్తువులు నశేషంబుగా భుజియింపవలయు॥ 179

క॥ మునుపు మధురసములు పదగొని, వెనుకన్ లవణములు దానివెనుకంగటుతి।
క్తనవామ్లద్రవ్యంబులు, గొనవలయు ననామయంబు గూడుటకొఱకున్॥ 180

వ॥ మొదట ద్రవంబులును, మధ్యంబున గఠినాశనంబులును, నంతంబున ద్రవంబులును భుజియింపవలయు. ఇట్లు భుజియించిలేచి ప్రక్షాళితపాదుండై, స్వస్థుండై, కృతాసనపరిగ్రహుండై, యిష్టదేవతాస్మరణంబుచేసి "యగస్త్యుండును, నగ్నియు, బడబానలంబును, నన్నంబు జీర్ణంబుసేయుదురుగాక. సమస్తేంద్రియదేహాన్వితుండు విష్ణుండు మద్భుక్తంబైన యశేషాన్నంబు జీర్ణంబుచేయుంగాక" యని కరంబున నాభినిమిరికొని తినినకీతి ననాయాసకర్మంబులు చేయవలయు. 181

క॥ ఆదృతి సవ్యాహ్నస్త్రాదివి, నోదంబుల దీసమునసేను సంగతిసంధ్యా।
ప్రాదుర్భావంబైనను, నాదేవు మనస్సంగొలువ నెప్పుడువలయున్॥ 182

వ॥ దినాంతసంధ్య సూర్యదర్శనంబుచేయుచు ప్రాతస్సంధ్య నక్షత్రంబులు చూచుచు నుపాసింపవలయు. సూతకాశౌచవిభ్రమాతురభయంబులఁ దక్క నితరకాలంబుల సంధ్యాకాలంబు గడపవలవదు॥ 183

ఉ॥ భానుఁడుగ్రుండువేళలఁ బ్రభాయుతుఁడై యుదయించువేళలన్
మానవుఁడెవ్వఁడే, నిదురమానక పోవ్రతతంబు రౌరవా।
ఖ్యానుపమాననారకములందు నశించును జాతిభూతుఁడై
నను బాపమంటునని రాస్యులుమానవలోకనాయకా॥ 184

వ॥ కావున నర్కుండుదయింపక మున్నలేచి పూర్వసంధ్యయు, నిమురింపక సూర్యునిఁ జూచుచు దినాంతసంధ్యయు నుపాసింపవలయు. కాలాతిక్రమణంబుచేసి సంధ్యోపస్థానంబు చేయని దురాత్ములు తామిస్రనరకంబునుం బొందుదురు. 185

గీ॥ మగుడఁ బాకంబు సేయించిమాపుసన్న; పత్నియును దాను శేషంటిపగిదివైశ్వ।
దేవముఖ్యక్రియలొనర్చి ధీరుఁడగుచు, నతిథిపూజలొనర్చుటయర్హ మనఘ॥

వ॥ నిరంతరశయ్యా సేవవలదు, కేశాస్థి, కంటకా, మేధ్య, బలి, భస్మ, తుషస్నా నార్ద్రభూములు ముట్టవలదు. కోరకొమ్ములుగల జీవంబులకు దూరంబునంద మెలంగవలయు. మంచున, నెండను, గాలిని, దిరుగవలదు. నగ్నుండై నీరాడు టయు, నిద్రించుటయు, నాచమనంబు సేయుటయుంగాదు. కచ్చకట్టక దేవార్చ నాచమనంబులు చేయరాదు. ఏకవస్త్రుండై హోమదేవార్చనాచమనజపాది కంబులు చేయరాదు॥ 208

సీ॥ దుర్వృత్తుఁగదిసిన దోషంబువాటిల్లు, సజ్జనసంగతిక్షణము చాలు।
ధార్మికుతో విరోధము చేయఁగాఁజన, సంతిక న్నను గూడ దక్షముతోడఁ।
బెండ్లియు వాదంబు వెంపొందుఁ దుల్యశీలులతోన గాకున్న నలఁతిఁ దెమ్మఁ,
గలహంబు వెంచుట గాదల్పహానికిఁ, దాళఁగావలయు, శాస్త్రప్రబోధల ॥

గీ॥ ధనసమార్జన కార్యంబు తిడవరాదు, జలకమాడిక వేళల స్నానశాటి।
నైననిజపాణిచేనైన నవయవములు, దోమఁగారాదు బుధునకు భూమినాథ॥209

వ॥ కేశంబులువిదల్పక, నిలుచుండి వార్వక, కాలుమీఁదకాలు సేర్పక, పూజ్యుల కెదురుగాఁ గాలుచాపక వర్తింపవలయు. గురువులయెదుట నీచాసనస్థుండై వినయంబున నుండవలయు. దేవాగార చతుష్పథంబుల కప్రదక్షిణంబు నడ వక, పూజ్యులకు, సోమార్కాగ్న్యంబు వాయువులకు నెదురుగా నిష్ఠీవనంబును. విణ్మూత్రోత్సర్జనంబు నుం జేయక నిలుచుండియు, నడచుచు మూత్రంబు విడువక, శ్లేష్మవిణ్మూత్ర రక్తంబులు దాఁటక, భోజనకాలంబున శ్లేష్మహాసో త్సర్జనంబులఁ జేయక, బలిమంగళజప్యాదులయందును, హోమకాలంబునను మహాజనసన్నిధిని స్త్రీలనవమానింపక యీర్ష్యలేక, మనస్తాపంబు చేయక, వారి వచనంబులు విశ్వసింపక వర్తింపవలయు. మాంగళ్యపుష్పరత్నాద్య పూజ్యులకు నమస్కరించికాని సదాచారపరుండిల్లు వెడలరాదు. చతుష్పథంబు నకు నమస్కరించుచు, కాలంబునహోమపరుండగుచు దీనానాథసాధువుల నుద్ధరించుచు, బహుశ్రుతుల నుపాసించుచు, దేవర్షిపితృ పూజనంబులు సల్పుచు, నాతిథ్యంబు చేయుచు, వర్తించు పురుషుండుత్తమ లోకంబులం బొందు ॥ 210

గీ॥ అదన, హితమిత్రుతోడవశ్యాత్ముఁడౌచుఁ, బ్రియములాడినయతఁడు సంప్రీతితోడఁ।
బొందునాహ్లాదకములైన పుణ్యలోక, చయములక్షయములుగాఁగ జనవరేణ్య॥

క॥ మతియును, లజ్జయు, క్షమయును, నతులవినయగతియు నీతియాస్తికతయు నూ।
ర్జితగతికల్గిన మనుజుఁడు, చతురతఁగను పుణ్యలోక సౌఖ్యములెల్లన్ ॥ 212

వ॥ మఱియును నకాలగర్జితాదుల యందును, బర్వాశౌచకాదులను, నుపరాగాదులయందును, ననాధ్యాయంబు చేయవలయు. ఎవ్వఁడేనియుఁ గోపితులైన సర్వబంధువుల నాశ్వాసించి శమంబునొందించు నతండుత్తమ లోకంబులనొందు, స్వర్గంబన నెంత, మఱియు నగ్రాతపాదుల యందు ఛత్రధరుండును, రాత్రులనడవులయందు దండధరుండును, నై సదాపాదుకలు దొడిగియు నమువవలయు, మీఁదును, దూరంబును, నడ్డంబును జూడక నడవవలయు, యుగమాత్రంబు మహీతలంబు చూచుచునడవవలయు ॥ 213

గీ॥ ఎవ్వఁడేనిదోషహేతువులగువాని, నెల్లవిడుచువశ్య హృదయుఁడగుచు।
నతనిపూరుషార్థ వితతికినింతైన, హానికలుగ నేరదధి పముఖ్య ॥ 214

వ॥ పాపిష్ఠుఁడైన పురుషునియెడ నైనఁ బ్రియంబు పలుకుచు నంతఃకరణశుద్ధుండగు పురుషునకు ముక్తికరతలామలకంబు, కామక్రోధ లోభంబులకు గోచరులు గాక సదాచారవంతులగు, పురుషుల యనుభావంబుచేతి నిమ్మహీమండలంబు ధరియింపంబడి యున్నదిగావునఁ బరప్రీతికారణంబైన సత్యంబు పలుకవలయు. అసత్యంబ పరదుఃఖకరంబైనఁ బలుకక యూరకుండవలయు. ప్రియంబైనను హితంబుగాకుండినఁ బలుకవలదు. అప్రియంబైన శ్రేయస్సంపాదకంబైన హితంబు పలుకవలయు ॥ 215

గీ॥ ఇన్ని చెప్పనేల భూమీశతిలక, యఖిలభూతోపకారకరంబగుచునిహము।
పరము నొసఁగెడువాక్యంబు పలుకవలయు, నవనిమనుజుండుకరణత్రయంబుచేత॥

వ॥ అనిచెప్పి మఱియు నిట్లనియె ॥ 217

క॥ సూనుఁడుపుట్టిన, గృహపతి, దానస్నానములువలయుఁ, దండ్రికినంతిన్।
భూనాథజాతకర్మ వి, ధానక్రమమాచరింపఁ దగునర్హగతిన్ ॥ 218

వ॥ అభ్యుదయార్థంబు శ్రాద్ధంబుచేయవలయు. యుగ్మంబులుగా దేవపితల నుద్దేశించి బ్రాహ్మణుల భోజనంబు సేయింపవలయు. ప్రాఙ్ముఖుండైన, నుదఙ్ముఖుండైనను దధ్యక్షతబదరంబుల దేవతీర్థంబుల దేవతలకుఁబితృతీర్థంబులఁబితలకుంగా, నాందీముఖదేవగణంబులకుఁ బిండప్రదానంబు చేయవలయు. ఇంకఁ బ్రేతకర్మ క్రియావిధి వినుము ॥ 219

క॥ మృతుఁడైనఁ బ్రేతదేహం, బతులశుభస్నానచందనామోదనుమ।
ప్రతతులనలంకృతముచే, సి తగ విమానమునఁ బెట్టిచెలువగుతీతిన్ ॥ 220

వ॥ పురబాహ్యమునకుం గొనిపోయి యగ్నిసంస్కారంబుచేసి నచేలస్నానంబు చేయవలయు. బాంధవులు దక్షిణాభిముఖులై గోత్రనామంబులు చతుర్థ్యంత

సమేతంబులుగాఁ జెప్పి జలాంజలినీయవలయు. అంత గోవులు ప్రవేశించు వేళ నక్షత్రదర్శనంబు సేయుచు గ్రామంబు ప్రవేశింపవలయు. భూమి కటుప్రస్తరశాయిత్వంబు వలయు. అనుదినంబును ప్రేతార్థంబు భూమియందుఁ బిండంబు విడిచి దివాభాగంబున మాంసవర్జంబుగా భుజియించి తమదినంబులు వెళ్లింపవలయు. ప్రథమ, తృతీయ, సప్తమ, నవమదినంబుల వస్త్రత్యాగ బహిస్స్నానంబులుచేసి తిలోదకంబు లీయవలయు. మూఁడవదినంబునస్థిసంచయనంబు సేయవలయు॥ 221

గీ॥ అస్థిసంచయనము చేసినంతనుండి, యవనినాథ సపిండుల నంటవచ్చు।
వినుసమానోదకులు భోగవిధులు దక్క, నస్పృశ్యులగుదురు సర్వక్రియలకునధిప॥222

వ॥ సంచయనంబు చేసినవెనుక సమానోదకులకు, సపిండులకు స్త్రీసమాగమంబు చేయరాదు. బాలుండును, దేశాంతరస్థుండును, పతితుండును, మునియు, జలాగ్న్యుద్బంధనాదులయందు మృతులైన జ్ఞాతులకు సద్యశ్శౌచంబు విధియింపంబడియె. మృతబంధుని యన్నంబు పదదినంబులు భుజియింపరాదు. దానప్రతిగ్రహణయజ్ఞస్వాధ్యాయంబులుం జేయరాదు. విప్రునకుఁ బదిదినంబులును, రాజన్యునకుఁ బండ్రెండు దినంబులును, వైశ్యునకుఁ బదేను దినంబులును, శూద్రునకు మాసంబును నాశౌచంబు. వీరలు స్వకాలోచితంబుగా శ్రాద్ధంబు చేయవలయు॥ 223

గీ॥ భూపవర్య, యయుగ్మకంబులుగ విప్ర, వరుల భుజియింపఁ జేయఁగావలయు శ్రద్ధ
దనరఁ బిండంబు నిడఁదగు దర్భతతుల, పైని మృతునకాచ్ఛ యుచ్ఛిష్టసన్నిధి భూమి॥

వ॥ ఇట్లు యథోక్తంబున శ్రాద్ధంబుచేసి సపిండీకరణంబుచేసి ప్రేతత్వంబుమాన్పి పితృత్వంబునొందించి యుత్తరక్రియలు నడుపవలయు. పుత్త్రులు, దౌహిత్త్రులు తత్పుత్త్రులు వీరలెవ్వరైనను నుత్తరక్రియలు నడుపవలయు. అవియొక్కింతయెఱిగించెదవినుమని యౌర్వుం డిట్లనియె॥ 225

చ॥ జలజభవేంద్ర రుద్ర వసునాసత్య మిత్ర హుతాశనానిలం
బులు, పితృవిశ్వదేవగణముల్ ఋషిమానుషపక్షిపన్నగం
బులుపశువుల్ సమస్తమగు భూతగణంబులుఁ దృప్తినొందు ని
శ్చలమగు శ్రద్ధతో నరుఁడు శ్రాద్ధము చేసినఁ బార్థివోత్తమా॥ 226

వ॥ ప్రతిమాసంబున నమావాస్యయందును శ్రాద్ధంబు చేయవలయు. ఇంకఁ గామ్యశ్రాద్ధంబు వివరించెద. వ్యతీపాతయోగంబున, విషువత్కాలంబున, సూర్యసోమగ్రహణకాలంబున, అర్కేందు సంక్రాంతుల, నక్షత్రగ్రహపీడల, దుష్టస్వప్నదర్శనంబుల, నవసస్యాగమంబుల నిచ్ఛా శ్రాద్ధంబు సేయవలయు॥227

గీ॥ సార్వభౌమ! యమావాస్య స్వాతితోడ, మైత్రితోడ విశాఖతోఁ జిత్రలీలఁ ।
గూడువేళల శ్రాద్ధంబు గోరి చేయఁ, దృప్తిపితరులకష్ట వార్షికి జనించు ॥ 228

చ॥ పొలుపగు కృష్ణపంచదశిఁ బుష్యపునర్వసు రౌద్రతారలం
గలసిన వేళ మానవుఁ డకంపితుఁడైతగు శ్రద్ధ శ్రాద్ధము।
త్కలిక నొనర్పఁ దృప్తియగు ద్వాదశవత్సరముల్ పితృప్రజం
బులకు నృపాలచంద్ర! యిది పూనికతో నొనరింపఁగాఁదగుఁ 229

గీ॥ వరుణతారతోడ, వాసవతారతోఁ, బూర్వభద్రతోడఁ బొసఁగఁ గూడి।
యున్నతత్వమమర నున్న యమావాస్య, దేవదుర్లభంబు భూవరేంద్ర ॥ 230

వ॥ ఈశోభిత నక్షత్రంబులతోఁ గూడిన యమావాస్యయందు శ్రాద్ధంబు చేసినఁ బితృతృప్తియగునని చెప్పి మార్కండేయుండు సగరున కిట్లనియె ॥ 231

చ॥ ఘనపితృభక్తివైభవము గల్గు నిలానుతుఁడో ప్రియాంవుం
డనఘ సనత్కుమారుఁ గని యాస్మృతివేఁడిన నమ్మునీంద్రుఁడా।
జనపతిఁ జూచి కాలమున శంసనుఁడై యెఱిఁగించె నెల్లను
ద్విసుతసంవర్తమిటువును బ్రవీణతతో వినుమంచు నిట్లనున్ ॥ 282

వ॥ భాద్రపద మాసంబునఁ గృష్ణపక్షత్రయోదశి యందును, మాఘమాసంబున నమావాస్యయందును, సూర్యసోమగ్రహణ కాలంబులయందు ద్రవ్యష్టకలయందును, నయనద్వయంబునందును, పితరులనుద్దేశించి శ్రద్ధాసమన్వితుండై తిలోదకంబులనైన నీయవలయు, శ్రాద్ధంబు చేసెనేని సహస్రసంవత్సర తృప్తియగును ॥ 233

గీ॥ మనుజనాథ వినుము మాఘంబునందమా, వాస్యఁగూడెనేని వరుణతార ।
యదియె పితరులకును మహాపుణ్యకాలంబు, పరమభాగ్యమదియె దొరకెనేని ॥234

వ॥ అమ్మాఘమావాస్యయును, సూర్యగ్రహణకాలంబును ధనిష్ఠతోఁ గూడిన నందుఁ బితరుల నుద్దేశించి శ్రాద్ధంబు చేసిన నయుతకులంబులతోఁ బితలు తృప్తినొందుదురు. ఆయమావాస్య పూర్వాభాద్రతోఁ గూడిననందు శ్రాద్ధంబు చేసినఁ బితలు యుగపర్యంతంబును దృప్తినొంది సుఖింతురు, గంగ, శతద్రు, విపాశ, సరస్వతి, నైమిశంబు, గోమతి, గోదావరి, యమునిమ్మహానదుల నవగాహించి పితలనుద్దేశించి శ్రాద్ధంబు చేసినఁ బాపంబులం బాయుదురు ॥ 235

చ॥ అనుపమమాఘమాసమున నర్థినమాతిథి యందుఁ దోయమై
ననుదనయాదులిచ్చిన మనంబునఁ దృప్తులమై సుఖింతుమం

చనుపమకౌతుకంబున మహాధ్వనిఁబాడుచు నుండునుత్సవం
బునఁ బితృసంఘము ల్వినుముభూపలలామ ! నిజంబుచెప్పితిన్ ॥ 236

వ॥ విశుద్ధంబులగు చిత్తంబులును, విత్తంబును, గాలంబును, విధియును, బాత్రం
బును, భక్తియు, నరులకువాంఛితంబు నిచ్చు. ఇంకఁబితృ గీతంబులైన శ్లోకం
బులుకలవవి వినియెట్లు చేయవలయునట్లు చేసెదవుగాని వినుమని సనత్కు-
మారుండు పురూరవున కిట్లనియె ॥ 237

క॥ మాకులమున నొక్కరుఁడ, స్తోకమతి ప్రతిభుఁడైన సుగుణుఁడుపుట్టున్ ।
గాకతఁడు విత్తశాఠ్యము, లేకయొసఁగుపిండములు చలింపనిభక్తిన్ ॥ 238

గీ॥ వెలయువిభవంబుకొలఁది పృథ్వీసురులకు, మమ్ముఁదలఁచి సమస్తభోగమ్ములువసు।
రత్నవస్త్ర మహీయానరాజియొసఁగు,ఁ దృప్తిపొందుద మేముమోదించియపుడు॥

వ॥ భక్తినమ్రుఁడైకాలంబున యథాశక్తి విప్రశ్రేష్ఠులకు నన్నంబుభుజింపం
జేయవలయు. అన్నంబున కసమర్థుండైన నామద్రవ్యంబైననిచ్చి స్వల్పంబైన
దక్షిణనీయవలయు. ఆమదానంబున కసమర్థుండైన జేరెఁడు నువ్వులైనను
బ్రాహ్మణులకీయవలయు. అందున కసమర్థుఁడైన నేడెనిమిది నువ్వుగింజలు గలిపిన
జలంబులయంజలులు మమ్మునుద్దేశించి భూమియందునిడవలయు. లేకున్న గోగ్రా
సంబైన నిడవలయు. ఏమియులేకున్న వనంబునకుంబోయి యూర్ధ్వబాహుండై
సూర్యాది లోకపాలురు వినునట్లుగా "శ్రాద్ధోపయోగ్యంబైన వస్తువు నాకు
లేదు. భక్తిచేతనే మత్పితలు తృప్తులగుదురుగాక" యని మాకునమస్క-
రింపవలయునని పితృగీతంబుల యర్థంబుచెప్పె. ఈ ప్రకారంబున నెవ్వండె
ద్దేని శ్రాద్ధంబుచేయు నాతఁడీసర్వంబును నాచరించినవాఁడని యౌర్వుండు
సగరున కిట్లనియె ॥ 240

గీ॥ అధిప శ్రాద్ధభోజనార్హ విప్రోత్తమ, తతులఁ దేటపఱుతుఁ దద్విధంబు ।
వినుము నావధానతను సదాచారసం, పన్నులాచరించుమార్గ మదియె ॥ 241

వ॥ త్రిణాచికేతుండును, త్రిమధువును, త్రిసుపర్ణుండునుషడంగవేత్తయు; శ్రోత్రి
యుండును, యోగియు జ్యేష్ఠసామగుండును, ఋత్విజుండును, స్వస్రీయుండును,
జామాతయు, దౌహిత్రుండును, శ్వశురుండును మాతులుండును, దపోనిష్ఠుం
డును, పంచాగ్న్యభిరతుండును, శిష్యుండును, సంబంధియు, మాతాపితృర
తుండును, మొదలగు వీరలెల్లఁ బూర్వాపూర్వులుత్తములు. ఉత్తమాభావం
బైన నుత్తరోత్తరుల నియమింపవలయు ॥ 242

సీ॥ వినుముమిత్రద్రోహియును, కునఖయుశ్యావ, దంతుండు భృతకవేదప్రయోక్త,
యభిశస్తుఁడును భృతకాధ్యాపితుఁడు గ్రామ, యాజకక్లీబచోరాంధపతితున ।

సోమవిక్రేతలు శ్రుతిమానునాతండు, తల్లిదండ్రులం బ్రోవనొల్లనతఁడు,
భ్రాతృపరిత్యాగిసూతి *పోష్టయునింది, తుఁడువృషలీపతిదూషకుండు ॥

గీ॥ కన్యకాదూషయితయు, రోగస్థితుండు, దేవలకుఁడాదిగల్గు భూదేవతలను ।
జెప్పఁగారాదు శ్రాద్ధంబుచేయుటకును, ధర్మశాస్త్రార్థవిదులు భూధరవరేణ్య ॥

వ॥ శ్రాద్ధంబునకుఁ దొలునాఁడ పితృదేవతార్థంబు శ్రోత్రియాదుల నిమంత్రింప వలయు. అనిమంత్రితులైనను, యతుల భుజియింపఁజేయవలయు. నిమంత్రణానంతరంబున యజమానుండువిప్రులును గ్రోధవ్యవాయాయాసంబులుచేయ రాదు. వ్యవాయంబులు చేసినవారిపితరులు రేతోగర్తంబునమునుంగుదురు. కావునఁబ్రథమంబ, నిమంత్రింపవలయు. స్నానంబు చేసిగృహంబునకు వచ్చిన విప్రుల పాదప్రక్షాళనంబుచేసి యాసనంబులం గూర్చుండంబెట్టి పితలకు నయుగ్మంబుగను దేవతలకు యుగ్మంబుగను నొక్కొక్కరినైనను యథేచ్ఛంబునుగా నియమింపవలయు. మాతామహశ్రాద్ధంబును నివ్విధంబుననె చేయ వలయు. అందు వైశ్వదేవంబులు వికల్పంబనిరి. దేవతలకుఁ బ్రాఙ్ముఖంబును, బితలకును దఙ్ముఖంబును బ్రశస్తంబు. దేవపితలకు శ్రాద్ధంబు పృథక్కరణం బనికొందఱు చెప్పుదురు. కొందఱేకపాకంబునఁ గూడం జేయవలయునని చెప్పుదురు. 244

గీ॥ ధరణినాయక విష్టరార్థంబునర్ఘ్య, సమితియిడిపూజచేసి శాస్త్రవిధినర్ఘ్య ।
మిచ్చియావాహనముచేసి యొసఁగుభక్తిఁ బితలకుఁను బ్రీతిసేయుటపెద్దమేలు॥

వ॥ తదనంతరంబ దేవతల నీళ్లు పూజింపవలయు. తిలాంబువులు పితరులకు, యవాంబువులు దేవతలకు, నర్ఘ్యంబీయవలయు. స్రగ్గంధధూపదీపాములిచ్చి సవ్యాపసవ్య ప్రకారంబుల దేవపితల నర్చింపవలయు. 246

క॥ క్షితివరయకాలంబున, నతిథియటకు నన్నకాంక్షియైవచ్చిన న ।
మ్మతినతనిఁబూజచేసిన, నతులితగతిఁ బొందు శ్రాద్ధమానంత్యంబున్ ॥ 247

వ॥ అతిథిని గడపిపుచ్చిన శ్రాద్ధంబునిష్ఫలంబగు. అనంతరంబ విప్రులచేత ననుజ్ఞాతుండై యగ్నియందు నాహుతిత్రయంబు యథావిధి వేల్చిహుత శేషంబల్పాల్పంబులగు పాత్రలయందుఁ బెట్టవలయు. తదనంతరంబ మృష్టంబును, నభీష్టంబును, సంస్కృతంబును నగునన్నంబువెట్టి "యథానుఖం జుషధ్వ"మ్మని యనిష్ఠురంబుగాఁ బలుకవలయు. విప్రులును దచ్చిత్తులై భుజియింపవలయు. యజమానుండును రక్షోఘ్నమంత్రపఠనంబుచేయుచుఁ దనపితలధ్యానంబు చేయవలయు. ఇట్లైనఁ బితృపితామహప్రపితామహులు తృప్తినొందుదురు. తదనంతరంబ పిండప్రదానంబుచేయవలయు ॥ 248

* సూతపోష్ట—'వృషలీసూతిపోష్ట' అనియుండవలెను శూద్రాపత్రపోషకుఁడని యర్థము.

మ॥ హరియజ్ఞేశ్వరుఁ డప్రమేయుఁడు సదాహవ్యంబు కవ్యంబు ని,
ర్భరవృత్తింగొను దేవుఁ డీపితృసుతంత్రంబుం గటాక్షించు నా।
సరసీజాక్షుని సన్నిధానమున రక్షస్సంఘభూతాదులీ,
ధరణింజేరకపోవుఁగాక వికలత్వంబొంది నల్దిక్కులన్ ॥ 249

వ॥ తదనంతరంబు విధానోక్తంబుగా వికిరంబుచేసి యుచ్ఛిష్టసన్నిధి పిండప్రదానంబుచేసి పూజించి బ్రాహ్మణులకాచమనం బిచ్చి హస్తప్రక్షాళనానంతరంబున సుస్వధేత్యాశీర్వాదపూర్వకంబుగా దక్షిణ యొసంగి పితృశ్రాద్ధంబును పితృపూర్వకంబుగా దేవతలను విడిచి యాద్వారపర్యంతంబు ననువర్తింపవలయు, మాతామహశ్రాద్ధం బిట్లు చేయవలయు. తదనంతరంబ వైశ్వదేవంబుచేసి పూజ్యభృత్యబంధువులుం దానును భుజింపవలయు. ఇవ్విధంబున బుధుండు పితృశ్రాద్ధంబును మాతామహశ్రాద్ధంబును జేయవలయు. చేసిన సుప్రీతులై సర్వకామంబుల నొసంగుదురు. 250

గీ॥ జనవరేణ్య వినుము శ్రాద్ధకర్మమునకు, మూఁడుకడుపవిత్రములు దలంప।
కూఁతుకొడుకు, తిలలు, కుతపకాలంబును, గానవీనిఁ గూర్పఁగలుగు మేలు॥

వ॥ రజతదానకీర్తనంబులును, రజతదర్శనంబును, ననునివి పవిత్రములు. క్రోధంబును, నధ్వగమనంబును శ్రాద్ధకర్తయు, భోక్తయు వర్జింపవలయు. 252

క॥ క్షితినాయక వినుసోముఁడు, పితలకు నాధారమవనిఁ బెంపగు యోగం।
బతనికి నాధారంబీ, కతనన్ముఖ్యుండు యోగి గణుతింపంగన్ ॥ 253

వ॥ అట్టి యోగీంద్రుండు శ్రాద్ధంబునకుఁ బ్రశస్తంబు. శ్రద్ధానియుక్తుండైన యోగీంద్రుండు పితరులను భోక్తలను, యజమానినిఁ దరింపజేయునని యౌర్వుండు సగరున కిట్లనియె. 254

గీ॥ మనుజనాథ హవిష్యంబు మత్స్య శశక, నకులమాంసంబులును ఛాగలక వరాహ।
గవయరురుహరిణీ శల్యకముల మాంస,ములును నిడ నెల్లపితరులకొలయుఁదృప్తి॥

వ॥ మేషమాంసంబును మాసతృప్తికరంబు, ఖడ్గమాంసంబును, కాలశాకంబును, దేనెయు మహాప్రశస్తంబులు, గయకుంబోయి యచ్చట శ్రాద్ధంబుచేసినఁ బితృతృప్తియగు. చేసిన యతని జన్మంబు సఫలంబు, ప్రశాంతికంబులు నీవారంబులు, శ్యామాకంబులు, శ్రద్ధార్హంబులైన వన్యౌషధులు, యవలు, ప్రియంగువులు, ముద్గంబులు, గోధూమంబులు, వ్రీహులు, తిలలు, నిష్పావంబులు, కోవిదారంబులు, సర్షపంబులు, శ్రాద్ధమునకు యోగ్యంబులు. ఆగ్రయణేష్టికిరాని, ధాన్యజాతంబును, రాజమాషంబులు,

